# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ * ఫిబ్రవరి : ౧౯౩౭ * సంచిక ౪



*

*

"ప్రతిభ" కు విరాళములు

శ్రీశ్రీశ్రీ కుమార రాజావారు, ముక్త్యాల ... ... రూ ౩౫
జయంతి శ్రీరామమూర్తి పంతులుగారు, బి. ఏ., బి. ఎల్. ... ౨౫
వెల్లంకొండ రాఘవరావుగారు ... ... ౧౦

# విషయానుక్రమణిక



## విన్నపము

నవ్యసాహిత్యపరిషత్సభ్యులూ చందాదారులూ, దయ ఉంచి సాధ్యమైనంత త్వరలో తమ చందా రూ ౧ పంపవేడుతాము. నాలుగు సంచికలూ అందినవెనుక ఇకనైనా చందా పంపడము విషయములో అశ్రద్ధ చేయకుందురుగాక అని ప్రార్థన.

కార్యదర్శి. నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు

# ప్రతిభ

నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ • ధాత : శిశిర సంచిక • సంచిక ౪


## వరపరీక్ష


శ్రీ శివశంకర శాస్త్రి


*

సోదరుడు

కెలికిచర్ల వెంకటరత్నానికి

అంకితము

*

మొదటిరంగము : పర్వతదుర్గము

అంతఃపురము : అర్ధరాత్రము

జ్యోతిస్సింగు

అది యేమి చిత్రమో
అడుగడుగునకు గూడ
అపశకునమే యయ్యె
ప్రియురాలా !

పయనమ్ము మానుడని
పరివార మంతయును
ప్రార్థించినది నన్ను
ప్రియురాలా !

గుర్రాలు మరలించి
కోటలోనికి బోవ
కోర్కి జనియించినది
ప్రియురాలా !

కాని, తావకసమా
గమ భావనావేశ
గరిమ నను లాగినది
ప్రియురాలా !

అలక

శ్రమ మిచ్చితిని మీకు ప్రాణేశ !
క్షమియింతురా నన్ను ప్రాణేశ !

కష్టమ్ము లేకుండ ప్రాణేశ !
కనుగొంటిరా త్రోవ ప్రాణేశ !
అందదో వార్త యని ప్రాణేశ !
ఆందోళనము కలిగె ప్రాణేశ !
చూచుదాకా మిమ్ము ప్రాణేశ !
క్షోభ తగ్గ లేదు ప్రాణేశ !
సిగ్గు విడిచితి నంచు ప్రాణేశ !
చింతింపరని యెంతు ప్రాణేశ !

జ్యోతిస్సింగు

సిగ్గు విడుచుట యేమి !
శ్రీ రుక్మిణీ దేవి
చేసెగాదా యిట్లె
ప్రియురాలా !
అంధకారము దిశల
నలముకొను నందాక
అడవిలో విడిసితిని
ప్రియురాలా !
భటుల నందే నిలిపి
పశ్చిమప్రాకార
భాగంబు దరిసితిని
ప్రియురాలా !
నీయానతిని వ్రాలు
నిశ్రేణిమార్గాన
నిమ్నభాగమునుండి
ప్రియురాలా !
కుడ్య మారోహించి
కోటలోపల జొచ్చి
గుప్తమ్ముగా నుండ
ప్రియురాలా !
పరులు కన్గొన కుండ
భద్రమ్ముగా నన్ను
ప్రతిహారి కొనివచ్చె
ప్రియురాలా !

అలక

ఒక్కవేళ మీరు నాథ,
పరులకంట బడినగూడ
ఈ దుర్గమునందు మీకు
ఎట్టిశ్రమము కలుగబోదు.
ఎచ్చటికో వెడలినార
లీయుదయము మాజనకులు
తిరుగ రారు రెండు మూడు
దినములు గడచెడు వరకును.
జనకు లిచట లేనితరిని
సకలభటులు నుద్యోగులు
పాలింతురు నాయానతి
బదులు మాట పలుకకుండ.
ఇంతేకాక, శూరులు మీ
రేయాటంకము లేకే
యిందు విశ్రమింపవచ్చు
ఇచ్చ వచ్చినట్లు నాథ !

జ్యోతిస్సింగు

వీరాంగనా, నిన్ను
వీక్షించినంత నే
శ్రమము తొలగెను, మనః
స్థైర్యమ్ము జనియించె.
వేట చాలించి నే
వెడలి పోయెడి వేళ
దుర్గమ్ము బురుజుపై
తోచితివి ప్రేయసీ !
సాంధ్యరాగప్రభా
స్నపితవై యానాడు

కనకపుత్రిక వోలె
కాన్పించితివి ప్రియా!
ప్రాంతభూమిరాజాగ్ర
ఫలముకై ఆనాట
నుండి యుత్కంఠతో
నున్నాను ప్రియతమా!
కొలదిసారులు నీవు
గోచరింపగ దుర్గ
పశ్చిమప్రాకార
భాగమ్ముపై ప్రియా,
అంతరంగమునందు
అనురక్తి నామీద
కలదు నీ కని నాకు
కలిగె విశ్వాసంబు.
దుర్గాధిపతి నాట
దుఃఖహేతువె యయ్యె!
గురుతింతు రే నంత
గూఢమ్ముగా నున్న!
అయిన గుప్తమ్ముగా
అడవి నెన్నోసార్లు
నీదర్శనార్థమై
నిలిచియుండెడివాడ!

**అలక**

ఎంత కష్ట మొందినారు!
ఎన్ని నెలలో గడచెగాని
సాహసించి వార్త నంప
జాలనైతి మీకు నాథ!
ప్రథమదర్శనంబునందె
ప్రణయము జనియింప నాథ,
బుద్ధియందు నిలిపి మిమ్ము
పూజ చేయుచున్నదాన!

ఆ దినమ్మునుండి నాకు
అన్యదృష్టి లేదు నాథ!
మీరు నేను గాక జగతి
మిగిలినవా రెవరు లేరు!
ఒక్కవేళ, నాప్రార్థన
ముజ్జగింతు రేమొ యనెడి
సంశయమ్ము పీడింపగ
సాగె కొన్నినాళ్ళు నాథ!

**జ్యోతిస్సింగు**

కష్టపడితి వయ్యొ! నీవు
కారణంబు లేకుండనె.
కనుల కద్దుకొనెడివాడె
గాన నిన్ను రాజపుత్రి!
వార్త యంపియుందువేని
వాలియుందు ప్రాణేశ్వరి!
నీపదాంబుజములకడను
నిముసములో నెగిరి వచ్చి.
నీయాశయ మేమొ నాకు
నిశ్చయముగ దెలియకుంట
సంశయాపన్న మతిని
చాల బాధపడితి ప్రియా!
ఎట్టివిషయ మైనగాని
హితవుగాక యుండె; దుర్గ
పాలనమ్ముగూడ మహా
భారముగా దోచుచుండె.
దూత నంప నెంచియు మీ
దుర్గమునకు, తండ్రిగారి
వింతపద్ధతులకు గొంత
వెరచి యూరకుంటి ప్రియా!

**అలక**

మనసు లొక్కటై యయ్యు
మనశరీరము లున్న

విన్నాళ్ళు దూరాన
హృదయేశా !

జ్యోతిస్సింగు

ఇది మొదలుగా మనకు
నింక నామరణంబు
అద్వైతసిద్ధియే
ప్రియురాలా !

అలక

(కౌగిలించుకొని)

ఈదుర్గమందుండి
యెట్లు లైనను నన్ను
త్వరితమ్ము కొనిపొండు
ప్రాణేశా !
ఏ రాజపుత్రునకో
యిచ్చి నను, పరిణయము
చేయునట నాతండ్రి
ప్రాణేశా !
ఈగాధ తెలియంగ
ఏమి తోచక మీకు
పత్రికను బంపితిని
ప్రాణేశా !
పొద్దు పొడవక ముందె
పోవలయు నెట్లైన
మన కోటలోపలికి
ప్రాణేశా !
ఈరాత్రియే యైన
నెవ్వ రనుమానింప
కుండ నరుగగ వచ్చు
ప్రాణేశా !
మీవెంట నిశ్రేణి
మీద నవరోహింతు;
భయ మేమియును లేదు
ప్రాణేశా !

జ్యోతిస్సింగు

వీలు లే దటుచేయ
వీరాంగనా ! నీవు
పన్నుండ నావీపు
పై, దిగుదు భూస్థలికి.
కాచుకొని యున్నారు
కానలో మనకోస
మస్మదుపజీవులౌ
అశ్వికాగ్రేసరుల్.
మా కెల్లర కరణ్య
మార్గముల్ సుగమముల్
వాయువేగము కలవి
వాజు లన్నియుగూడ.
మన దుర్గమున జేరి
మంచిరోజున నిన్ను
పరిణయంబై చేతు
పట్టంపు దేవిగా.
పదమున మగుదము లెమ్ము,
ప్రాణప్రియా రమ్ము !
జాగు చేసితిమేని
చంద్రోదయం బగును.

అలక

ఇపుడెకదా వచ్చినార,
లించుక విశ్రాంతి పొంది
బయలుదేరవచ్చు నాథ,
బడలిక తొలగిన పిమ్మట.
చంద్రోదయ మైన నేమి ?
శత్రుభయము లేదు గాన
భటులు పశ్చిమమ్మునందు
ప్రమత్తులై యుండగలరు.
పాత్రములం దుంచినాను

ఫలరసంబు లివిగో, ఇవి
థాసవములు మీ కొరకే
ఆస్వాదింపుడు వీనిని.
వనమార్గంబుల, గుట్టల,
వాగుల, దుర్గమభూముల
పయనములో బడలినారు
పదపద్మము లొత్తెనిందు.

**జ్యోతిస్సింగు**

పట్టమహిషి వగుదు వీవు
ప్రాణేశ్వరి, అచిరముగనె.
పరిచారిక రాదగినది
పాదసంవాహమునకు.
నిన్ను గాంచినంతలోనె
నిఖిలశ్రమ వాసె ప్రియా!

* *

నీ మధురాలింగనమున
నిర్వృతియే ప్రాణేశ్వరి!
జీవిత పరమావధియే
చేకూరిన దీక్షణాన.
ధన్యుడ నీకౌగిలిలో
తనువు విడుతునేని ప్రియా!

**అలక**

కాంతు డాడిన అమం
గళవాక్య మియ్యెడనె
ప్రతిహతం బగుగాక
పరమేశ్వరీ కృపను!
కాపాడుడీ ప్రాణ
కాంతు దేవతలార,
అనునిమేషము మీర
లనుసరించుచు దయను!
ఏల ప్రాణేశ్వరా,
ఈ ట్లనాలోచిత
వ్యాహారములచేత
వ్యధ నాకు కలిగింప?
అమరులారా, మీర
లాయుస్సు సమముగా
దయసేయ గదరయ్య,
దాక్షిణ్యమున మాకు!

**జ్యోతిస్సింగు**

భయము చెందగ నేల
ప్రాణప్రియా, మనకు
నుభయులకు విశ్లేష
ముండ దిం కెన్నటికి
గ్రహియించితివొ లేదొ
గాఢసౌఖ్యమునందు
ఉండు ప్రియతమ, అను
స్యూతమ్ముగా బాధ

(ఆకస్మికముగా లోనికి ప్రవేశించి)

**దుర్గాధిపతి - గంభీరసింగు**

ఎవరు నీవు? పలుక వేమి?
ఇచటి కేల వచ్చినావు?
ఏమిది? జ్యోతిస్సింగ!
నమ్మజాలకున్నాడను
నయనంబుల - ఆశ్చర్యము!
అంగీకారము వడయక
అస్మద్దుర్గములోనికి
రా గతం బేమి చెపుము
రాజపుత్రి వీరాగ్రణి!

**జ్యోతిస్సింగు**

దుర్గాధిప, మదీయ
దోషంబు క్షమియింప
వేడుచున్నా ననా
విలమానసంబుతో!

గంభీరసింగు

శూరాగ్రణివే! ఈగతి
చోరునివలె మాదుర్గము
చొచ్చినాడ ; వంతెకాక
శుద్ధాంతము ప్రవేశించి
అవివాహితతో నొంటిగ
నర్ధరాత్రికాలమందు
భాషించుచు గానబడుట
పౌరుషవంతుల కెంతటి
క్రోధకారణంబో నీవు
గుర్తెరుగుదువా కుమార ?

జ్యోతిస్సింగు

అంగీకృతిని బడయ
కంగణము చేరుటే
యుక్తంబు కానేర ;
దొంటిగా నాపైని
కన్యకాంతఃపురా
గారాన నడురేయి
గానవచ్చుట దొడ్డ
కార్య మెన్నడు కాదు.
కాని యొక్క రహస్య
కారణం బుంటచే
దుర్గాధిపా, నన్ను
దుహిత సన్నిధియందు
కాంచినా రిప్పు డా
కస్మికమ్ముగ మీరు.
నాకు దెలిపిరి మూడు
నాళ్ళవరకును మీరు
రాజధానికి మరలి
రారనుచు. ఏలనో
అచ్చెరువు గొలుపంగ
నరుగుదెంచితి రిపుడె.

గంభీరసింగు

అది యటుంచుము. త్వదీ
యాగమనకారణం
బేమొ తెలుపగ వైతి
వీపరివర్తన మేమి ?
యుక్త మనియే నీవు
యోజించుచున్నావ ?

జ్యోతిస్సింగు

రాజకార్యముమీద
రాలేదు నే నిటకు.
దుష్టసంకల్పాన
దుర్గమ్ము చొరలేదు.
తస్కరుండని నన్ను
తలపవలదని కోర్కె.
అరుగుదెంచినవాడ
నన్యథా విధిలేక !

దుర్గాధిపతి

ఎంచవైతివిగదా
యీయమాయకురాలి
కపరిత్యాజ్య ఘటిల్లు
నంచు నీమూలమున.
ఇంక నాతనుజాత
కెట్లు పరిణయ మగును ?

జ్యోతిస్సింగు

పుణ్యస్వభావ మీ
పుత్రికారత్నంబు !
నిష్కలంకం బైన
నిండు ప్రేముడితోడ
అంతఃపురములోని
కరుదెంచియున్నాడ.
పరిణయానంతరము
పట్టంపుదేవిగా

గావింప నీమె నా
గాఢసంకల్పంబు.

గంభీరసింగు

అదియ ! మంచిమాట ! కాని
అడుగవైతివేల నన్ను ?
మీజనకులు మేము గాఢ
మిత్రుల మని తెలియుగదా.
అడిగియున్న నీవు కన్య
నాదరమున నిచ్చియుందు
అనుసరించినాడ వకట
అపమార్గము రాకుమార !

జ్యోతిస్సింగు

కావచ్చును, కాని మీరు
క్షమియింపర తారుణ్యము ?
అది యేమో జంకువలన
అర్థింపగనైతి మిమ్ము.
విశదమగుట మీహృదయము
వేడుచున్నవాడ నిపుడు.
గతము విస్మరించి, నన్ను
కైకొనుండు జామాతగ.

దుర్జయసింగు (లోని కడుగిడి)

అది యెట్లు పొసగు? మీ రాడినమాట
తప్ప రెన్నటికని తలచుచున్నాను.
దుర్గాధిపా, నాకు దుహిత నొసంగి
చేతు పెండ్లి యటంచు చెప్పియున్నారు.

అలక (తలుపు చాటుక)

సాహసమ్మును పితా, క్షమియింపవలెను
వలదు నా కిపు డీవివాహమ్ము వలదు.

గంభీరసింగు

హిత మేదియో తల్లి, యెరిగి దుర్జయుని
అంగీకరింపుమీ అనురూపవరుని
ఇతనికి మాట నే నిచ్చియున్నాను.
తండ్రివాక్యము నన్యధా చేయకమ్మ!

అలక

నా కీవివాహమ్ము నచ్చుట లేదు
కరుణతో నను పితా, క్షమియింపవలెను!

గంభీరసింగు

ఎట్టి చిక్కు తెచ్చినావు !
ఏది కర్తవ్య మిపుడు !

* *

వరపరీక్ష చేయవలసి
వచ్చిన దీతరుణమందు
స్వయంవరణ మాదినుండి
క్షత్రియాంగనా వివాహ
విధానముగ ధర్మశాస్త్ర
విదులు నిర్ణయించినారు.
ప్రథితమార్గ మనుసరింప
ప్రత్యవాయ మేమి లేదు.

దుర్జయసింగు

కన్య నీయంగ వాగ్దానము నాకు
చేయక పూర్వమే చెప్పినయెడల
మెచ్చుకో దగినదే మీవిధానంబు
యోజింపు డియ్యెడ యుక్తమా నేమో !

గంభీరసింగు

వలదు లెమ్ము స్వయంవరము
వరపరీక్ష చేయదగును.
పణము నిడిన తప్పులేదు
పరీక్ష దూష్యంబు కాదు.
పూజ్యు లాచరించినారు
పూర్వరాజు లీవిధంబె.
జనకమహారాజ, ద్రుపద
జనవిభుల్ తదీయసుతల
పాణిపీడనమ్ముకొరకు

పణము పెట్టినారు కాద ?
త్రిపుర వైరి కార్ముకంబు
త్రిజగదారాధ్యుడైన
దశరథాత్మజుండు విరిచె
ధరణిసుతను బడయుకొరకు.
ద్రుపద రాజపుత్రికినై
ద్రుంచినాడు మత్స్యయంత్రి
ఘఖలమహేష్వాసమాళి
అర్జునుండు నిండుసభను.

జ్యోతిస్సింగు

క్షత్రియోచితంబ యేని
సమ్మతంబె వర పరీక్ష.

గంభీరసింగు

చాల మంచిమాట మీరు
సమవయస్కు లధిక బలులు
ఒక్కరోజు పూర్ణముగా
నుపవసించి శుచి యగుచును
ఇరువురిలో నెవరు కన్య
నెత్తుకొని నగాగ్రి మెక్కి
దేవిమందిరమ్ముకడను
దింపగలరొ వారి కేను
ప్రీతితోడ కన్న నిచ్చి
పెండ్లిచేతు. ఇదె ప్రతిజ్ఞ!
కొండకొనను జేరకుండ
కూరుచున్న త్రోవలోన
యువతి దింపునెడల గాని,
ఓడిపోయినట్టు లెంతు.
మొదట నొప్పుకొన్న వారు
ముందు శిఖర మెక్కదగును.

జ్యోతిస్సింగు

చిత్తము. మహాప్రసాదము
స్వీకరించినాను పణము!

దుర్జయసింగు

ఈ విచిత్రఘటనము నే
నిచ్ఛగింప దుర్గాధిప!

అలక

ఉపవసింప దిన మెల్లను
ఒప్పుకొంటి రేల ప్రభూ!

జ్యోతిస్సింగు

భయపడకుము రాజపుత్రి!
బాహుబలం బెరుగవు, మరి
నీశరీర సన్నికర్ష
నిరుపమానశక్తి నొసగు!

గంభీరసింగు

యోధువేషం బింక
నుజ్జగించి కుమార,
విశ్రమింతువుగాని
వెడలిరా నావెంట.

జ్యోతిస్సింగు

ఉత్కంఠతో వేచి
యున్నారు నాకోస
మడవియందున మదీ
యాశ్వికుల్ దుర్గేశ!

గంభీరసింగు

అటులైన జేరు గా
తాశ్వికావళికి, నీ
దుర్గమ్మునకుగూడ
తోడనే శుభవార్త.
తొలగిపో జూతువో
దుర్జయసింహా! మా
యతిథిసత్కారంబు
నంగీకరింపవలె.

✱

# యక్షగానము

చింతా దీక్షితులు

యక్షగాన మంటే ఏమిటి? బ్రౌన్యనిఘంటువులో యక్షగాన మంటే ఒకవిధమైనపాటగా నిర్వచింపబడ్డది, కాని నాటక మనలేదు.

అప్పకవీయములో యక్షగానమును గురించి వ్రాయబడ్డది. అందు, అర్ధచంద్రికలు, త్రిపుట, జంపె, అటతాళము 'వీన యక్షగానప్రబంధంబు లతుకవచ్చు' అని అప్పకవి వ్రాసినాడు. అనగా పాటలుగల ఒక ప్రబంధమని అప్పకవి అభిప్రాయమైనట్లు మన మూహించవచ్చును.

శ్రీనాథుడు దక్షవాటీమహాపురమును భీమఖండములో వర్ణిస్తూ "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగానసరణి" అన్నాడు. శ్రీనాథుని కాలమునాటికికూడా యక్షగానములు పాటలే అని మన మనుకొనవచ్చును. మరిన్నీ శ్రీనాథుడే కాశీఖండములో,

> "వల్లకి చక్కి కాహళము వంశము ఢక్క హుడుక్క ఝర్ఝరుల్
> ఝల్లరి యాదిగా గలుగు శబ్దపరంపర తాళశబ్దమై
> యుల్లసిలం బ్రబంధముల కొప్పుగ నాడుదు రగ్రవేదిపై
> బల్లవపాణు లీశ్వరుని బంటమహీశులు పూజసేయగన్.

అని వ్రాసినాడు. ఈప్రబంధములు ఎట్టివో భీమఖండమున వర్ణింపబడ్డవి.౧

యక్షగానాలు పాడేటప్పుడు పల్లవపాణులు వేర్వేరువాద్యముల తాళములకు ఆడేవారని కూడా ఊహించవలసిఉన్నది.

అయ్యగారి వీరకవి తాను వ్రాసిన చిత్రాంగదవిలాసమనే యక్షగానములో ఈవిధముగా చెప్పినాడు.

---

౧ భీమఖండము ప్రథమాశ్వాసములో భీమేశ్వరుని కొలువు ఈరీతిగా వర్ణింపబడ్డది.

"భీమేశ్వరుండు......అల్లయవేమభూపాలరాజ్యభారధురంధరుండైన బెండపూడన్నయామాత్యుడు గట్టించిన మొగసాలవాకిటి మహోత్సవమండపంబునందు పేరోలగంబుండి కుండలీదండలాస్య పేరణీ ప్రేంఖణసింధుకందుకధమాళి చేలమల్లీ హల్లీసకాదినృత్యంబులవలోకింపుచు, బంతంబు అవధరింపుచు మేళంబు లాలకించుచు, జంపూచాటునాటకోదాహరణజయఘోషచక్రవాళచతుర్భద్రిచతురాశిప్రబంధంబులాకర్ణింపుచు—ఇందలి నాటకప్రబంధములు యక్షగానప్రబంధములే.

" ... ... ... నాకు దోచు
నట్టు లానంద మొప్ప ధర్మాంగచరిత
మనగ చిత్రాంగదవిలాసమనగ యక్ష
గాన మొనరింతు వేషముల్గట్టి జనులు
పాడి వినిపింప బుణ్యాస్పద ఘటింప"

దీనినిబట్టి యక్షగానములను జనులు వేషములు గట్టి పాడి వినిపించేవారని తేట పడుతోంది. ఈకాలపు నాటకాలవలె గాక ఆకాలమున ఎవరో ఒకరు వేషాలు వేసుకొని కథ అంతా పాడేవారని ఊహ.

ఉత్తర రామచరిత్రము వ్రాసిన కంకంటి పాపరాజు విష్ణుమాయావిలాస మనే యక్షగానము వ్రాశాడు. అందులో ఇట్లున్నది :

కంకంటిఅప్పనాగ్రణి కుమారుండు
పంకజలోచనపంచబాణుండు
పాపరా జొనరించె బహుపదార్థముల
వ్యాపించి విష్ణుమాయావిలాసంబు
భూమిని తిలకించి బుధులెల్ల బొగడ
అమిత్రితారాభ మైవిభాసిల్ల.

దీనినిబట్టి చూచినా జనులు వేషములుగట్టి పాడగా బుధులు చూచి ఆనందించే వారని తోస్తోంది.

మొట్టమొదటిరోజుల్లో కూచిపూడిభాగవతులు వేసే "భామవేషం" ఇట్టి యక్షగానమని నా ఊహ. భామవేషంలో కథ పారిజాతప్రసంగము. తనకు నారదు డిచ్చిన పువ్వును శ్రీకృష్ణుడు రుక్మిణి కీయగా సత్యభామ విని కోపించుట, విరహముపాలౌట, కృష్ణునికి సందేశ మంపుట, కృష్ణునితో కలుసుకొనుట, అలక తీరుట. ఇందులో వేషము కట్టేది సత్యభామ ఒక్కతే. ప్రక్కనున్న బ్రాహ్మడు సమయానుకూలంగా చెలికత్తె అవుతాడు, వైద్యు డౌతాడు, హాస్యగా డౌతాడు. ఏపాత్రబడితే ఆపాత్ర అవుతాడు. చిట్టచివరకుమాత్రం శ్రీకృష్ణవేషం కనిపిస్తుంది కాని శ్రీకృష్ణుడు మాట్లాడడు.

ఈభామవేష మనే పారిజాతమును వ్రాసిన సిద్ధేంద్రయోగి తన గ్రంథమును శృంగారప్రబంధ మన్నాడు. యక్షగానాలను ప్రబంధము లనడం పరిపాటి కాబట్టి ఈభామవేషం యక్షగానంగా మనము భావించవచ్చును.

పైవిషయములనుబట్టి యక్షగాన మంటే పాటలతోకూడిన ఒక ప్రబంధ మనిన్నీ, దానిని ఎవరో ఒకరు వేషము వేసుకొని పాడుతూ ఆడేవారనిన్నీ బోధ పడుతోంది.

ఇప్పుడు యక్షగాన మంటే వీధినాటకమని మనము వాడుతున్నాము. కాని యక్షగానము వేరు, నాటకము వేరు. తంజావూరురాజుల కాలములో నాటకాలూ వ్రాశారు. యక్షగానాలూ వ్రాశారు. నాటకాలలో ఒకరిద్దరే కాకుండా అందరూ వేషాలు వేసేవా రనిన్నీ అందరూ పాటలూ పద్యాలూ పాడుతూ ఆడుతూ ఒక మాదిరి ఈకాలపునాటకాలలాగే నాటక మాడేవా రనిన్నీ తోస్తున్నది. ఇంతే కాకుండా యక్షగానాలలో అంకవిభాగ ముండదు. ప్రబంధముల మాదిరిగానే ఇష్టదేవతాప్రార్థనము, సుకవిభూషణము, కుకవినింద, షష్ఠ్యంతములు, కథాప్రవేశము ఉంటవి. నాటకాలలో అట్లుగాక అంకవిభాగముకూడా ఉండవచ్చును. త్యాగరాజవినోదచిత్రప్రబంధ మనేనాటకము ఆరంకములు గలది. ఈవిషయమై ఇదమిత్థ మని యింకా ఏమీ చెప్పజాలను.

అక్కనామాత్యుడు వ్రాసిన బాలకృష్ణలీలావిలాస మనే నాటకములో,

> "కామునిగన్నచక్కని 'బాలకృష్ణ
> లీలావిలాసలాలితనాటకంబు'
> భూలోకమున శుభంబుల పొల్పుమీర
> సరలిలో భరతశాస్త్రప్రవీణతను
> పరగంగ కన్నులపండువుగాగ
> ఆ చతుర్ముఖనిర్మితావనియందు ..."

ఈనాటకా లయితేనేమి యక్షగానా లైతేనేమి భరతశాస్త్రప్రవీణత చూపించడంకోసమే ఉద్దేశింపబడినవి.

ఈమధ్య కూచిపూడి భాగవతు లాడే ప్రహ్లాద, రామాయణాదులు యక్షగానాలు కావు. వాటిని వీధినాటకా లనడమే యుక్తము. ఇవి యక్షగానాలు పరిణమించగా పుట్టియుండవచ్చును.౧

౧ యక్షగానమన్నా నాటకమన్నా ఒకటేగా భావించేవా రనడాని కిది నిదర్శనం. లేదా స్వతంత్రముగా పుట్టియుండవచ్చును. ఆంధ్రపండితుడొకడు దక్షిణాదికి వెళ్ళి ప్రహ్లాదనాటకము ఆడే పాడేవిధము నేర్చుకొనివచ్చి ఆంధ్రదేశములో ప్రవేశపెట్టాడనీ అప్పటినుండి ఆనాటక మాడుతున్నారనీ, క్రమక్రమముగా అట్టినాటకములు విరచించబడి వీధినాటకాలుగా ఆడబడుతున్నవనీ దివితాలూకాలో కొందరు వృద్ధులు నాతో చెప్పారు.

పగటివేషాలు, తోలుబొమ్మలు, యక్షగానాలు మన ఆంధ్రదేశమున నాటకాలు పరిణమించినవిధమై ఉండవచ్చును. చిట్టచివరకి యక్షగానాలు వీధినాటకాలై యుండవచ్చును.[3] ఒక సంస్కృతసంపర్కముగాని, ఒక ఇంగ్లీషు సాక్కగాని లేకుండా జాతీయపద్ధతి పరిణమించిన ఈనాటకాలలో ఉపజ్ఞ, కళా, కౌశలము, చాతుర్యము, జాతీయత బహుళముగా ఉన్నవి. సంగీతసాహిత్యాభినయముల కాటపట్టులై ఉన్నవి. ఈకాలపునాటకాలకంటె మనోహరముగా ఉంటవి. కృతకగ్రాంథికభాషతో జీవములేని సంభాషణములు చేయడ మం దుండదు. జీవద్భాషలో జాతీయముగా సంభాషణ జరుగుతుంది.

ఇట్టి నాటకములకున్నూ యక్షగానములకున్నూ ఇంతవరకూ మన కవుల చరిత్రలలోగాని, వాఙ్మయ చరిత్రలలోగాని స్థానము లభించలేదు సరిగదా యివి పండితుల ఈసడింపులకు పాలౌతున్నవి. పూర్వకవులూ, పండితులూ వీటిని ఆదరించేవారేగాని అనాదరణభావంతో చూచేవారు కారు. ఈకాలపు కొందరు పండితులు మాత్రమే వీటికి సారస్వతమున తావు లే దంటున్నారు. మన సారస్వతము బహుముఖములుగా వ్యాపించిఉన్నది. అటు పండితులకే కాకుండా యిటు పామరులకూ, పిల్లలకూ, స్త్రీలకూకూడా ఉచితగ్రంథములు పూర్వులు రచించి యున్నారు. ప్రబంధములూ పురాణములూ పండితులకైతే, పాటలూ పదములూ కీర్తనలూ మొదలైనవి తదితరులకు. మహాకవు లిటు పండితులకూ అటు ప్రజాసామాన్యమునకూ కావ్యరసామృతం దోసిళ్ళాది తాగేందుకు అనేకవిధాల గ్రంథాలు వ్రాశారు.

చేకుమళ్ళ అచ్యుతరావుగారు వ్రాసిన విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రకు పీఠిక వ్రాస్తూ శ్రీజయంతిరామయ్య పంతులుగారు ఈ విధంగా వ్రాశారు.

"It is true there are a number of short dramatic pieces preserved in the Tanjore Palace library, some of them being composed by the Naick Kings themselves but they are of the class of small English operas and do not aspire to the rank of literature."

3 1624 ప్రాంతమందున్న గోకులపాటి కూర్మనాథకవి మృత్యుంజయవిలాస మనేయక్షగానము వ్రాశాడు. అది అతిప్రౌఢముగా ఉన్నది.

"వైకుంఠవామన వారిజనాభ, శ్రీకంకితముగ నా నేర్చినరీతి
మృత్యుంజయవిలాసమృదుతరకావ్య, మత్యంతభక్తితో యక్షగానంబు
రచియించి నీకుసర్పణ సేయదలచి"— అని ఒకచోట తనగ్రంథాన్ని యక్షగానమన్నాడు.
"అత్యంతభక్తితో నంకితంబైన, మృత్యుంజయవిలాసమ్ముల నాటకము
హరికంకితంబొట హరికథయోట."— అనియింకొకచోట దానినే నాటకమనీ అన్నాడు.

జయంతి రామయ్యగారు పేర్కొన్నట్లు ఇవి చిన్ననాటకములే కావు. ఇందులో చిన్నవీ పెద్దవీ కూడా ఉన్నవి. పరిషత్తుతరఫున అచ్చువేసిన రంగాజమ్మ వ్రాసిన మన్నారుదాసవిలాసనాటకము డెమ్మీ సైజున 53 పేజీలు పట్టింది. కూచిపూడివారాడే ప్రహ్లాదనాటకం పూర్తిగా ప్రదర్శించడానికి ఏడురాత్రిలు పడుతుంది. చిన్నది పెద్దది అనే తారతమ్యాలనుబట్టి నాటకం విలువ ఎంచకూడదుగదా!

ఇంతేకాకుండా ఈనాటకాలు తంజావూరుభాండాగారమందే ఉన్నట్లు వ్రాశారు. పరిషత్తు భాండాగారంలో, ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలో కూడా ఉన్నవన్న సంగతి వారికి తెలుసును. ఇవేకాక చాలానాటకాలు అచ్చుపడి ఉన్నవికూడాను.

వారు పీఠిక వ్రాసిన వాఙ్మయ చరిత్రలోనే హాయలక్షణసారసంగ్రహాన్ని గురించికూడా వ్రాయబడి ఉన్నది. గుర్రంమీద వ్రాసిన పద్యాలూ, నిఘంటువులూ వీటికి సారస్వతమైనప్పుడు ఈనాటకాలు చేసుకొన్న దురదృష్టమేమిటో వీటికి సారస్వతశ్రేణిలో విస్తరి దొరక్కపోవడానికి.

ఈయక్షగానాలు సారస్వతశాఖ అనీ – ప్రశస్తమయిన సారస్వతశాఖ అనీ, దీనిని ఈసడించరాదనీ ఇప్పుడు నిరూపిస్తాను.

ఈయక్షగానాలు వ్రాసినవారిలో మహాకవులూ గొప్పపండితులూ ఉన్నారు. వారిలో కొందరిపేళ్ళూ, వారువ్రాసిన గ్రంథాలు కొన్నీ ఉదాహరిస్తున్నాను.

నేను తెలుసుకొన్నంతవరకు మొట్టమొదటి యక్షగానం 1530 ప్రాంతమున రచింపబడ్డది. నాటినుండి నేటివరకున్నూ యక్షగానాలు రాస్తూనే ఉన్నారు. మనము మాత్రము వాటిని పరికించడం లేదు.

పింగళి సూరన్నకు పూర్వమందున్న చెన్నశౌరి అనే కవినిగూర్చి ఈవిధముగా నారసింహపురాణమందున్నది.

> ఆమంత్రిపుంగవుం డష్టభాషాకవి
> వర్యుండై పొగడొందె వసుధయందు
> ద్విపదగా నారసింహపురాణ మొనరించి
> భక్తి నహోబల భర్తకిచ్చె
> బాలభారత మంధ్రభాషను వచనకా
> వ్యంబుచేసెను గవీశ్వరులు మెచ్చ
> సౌరభిచరితంబు జక్కులకథ జెప్పె
> లాలితనవరసాలంకృతముగ

మరియు పెక్కుకృతుల్ పటుమతి రచించె
ఖ్యాతి నరసింగరాయలచేత గొనియె
నగ్రహారంబులును వివిధార్థములును
వెలసె గొండమ బెండ్లియై విభవ మెసగ.

సౌరభి అనే యక్షగానము వ్రాసిన చెన్నమంత్రి సామాన్యుడు కాడుగదా!

రఘునాథరాయలు కృతినందిన గ్రంథములను చెప్పుతూ కృష్ణాధ్వరి ఇట్లు చెప్పాడు. 'కల్యాణకౌముదీ కందర్పనాటక, కన్యోద్వాహన బద్ధకంకణుండు' అని.

ఈ కౌముదీనాటకము ఎలకూచి బాలసరస్వతి వ్రాసినదై ఉండవచ్చును. ఎందువల్లనంటారా? ఎలకూచి బాలసరస్వతిభట్టమహోపాధ్యాయుడు రాఘవ యాదవపాండవీయములో "కవిసమీహితరంగకౌముదీనామనాటకవిధానప్రతిష్ఠా ఘనుండ" అని తన్నుగూర్చి చెప్పుకొన్నాడు. ఇతడు సామాన్యుడు కాడుకదా! నిరంకుశోపాఖ్యానమునువ్రాసి కృష్ణదేవరాయల ఆస్థానములో అష్టదిగ్గజము లలో నొకడుగా పేరందిన కందుకూరి రుద్రయ్య జనార్దనాంకితముగా 'సుగ్రీవ విజయ'మనే యక్షగానము వ్రాశాడు. ఈపుస్తకము అచ్చుపడి[illegible]లో ఉన్నది. [illegible]టలూ పదముల

అప్పకవీయమును వ్రాసిన కాకునూర్యప్పకవి తన్నుగూర్చి [illegible]లకూ అటు ప్ర[illegible] [illegible]నుకు అనేకవిధ వ్రాసుకున్నాడు.

లలితకవికల్పకాఖ్యానలక్షణంబు
మహిత సాధ్వీజనౌఘధర్మద్విపదయు
అంబికావాదనామకయక్షగాన
కృతియు జేసితి కాకునూరికులయప్ప.

అప్పకవియంతటివాడు అంబికావాద మనేయక్షగానం వ్రాశాడు.

రాజయోగసారము, వేంకటాచలమాహాత్మ్యము ద్విపదభాగవతము వ్రాసి శ్రీకృష్ణుని ప్రత్యక్షము చేసికొన్న తరిగొండ వెంకమ్మ శివవిలాస మనే యక్ష గానం వ్రాసినట్లు ఈవిధంగా చెప్పుకొన్నది.

" సరసత శివవిలాసం బనుకథను
కర మర్థితో యక్షగానంబు చేసి
పరమభక్తిని వీరభద్రున కొసగ "

మిత్రవిందాపరిణయమును వ్రాసిన కందుర్తి వెంకటాచలపతినిగూర్చి,

"ఘటియించినావు ద్రాక్షాపాకముగ బహు
నాటకంబులు సమున్నతి జెలంగ"

అని వ్రాయబడ్డది. ఇతడు భారత భాగవత రామాయణములు వచనకావ్యములుగా వ్రాసిన కవి.

కంకంటి పాపరాజు, ఉత్తర రామాయణకర్త, తన్నుగూర్చి తనయిష్టదైవము పల్కినట్లు ఇట్లు చెప్పుకొన్నాడు.

"శ్రీవెలయ మున్ను విష్ణుమాయావిలాస
యక్షగానంబు మాకె సమర్పణముగ
జేసి తదియాదిగా మేము నీసుధాను
సారివాక్కుల జొక్కియున్నార మనఘ."

దేవుళ్ళుకూడా యక్షగానా లంగీకరించి పొగడారు కాని వాటికి సారస్వతంలో తావు లేదనిమాత్రం 'సారస్వతహిట్లర్లు'గా ఉందామని ఆశించే అసాములు ప్రకటిస్తున్నారు.

ఆంధ్రకాళిదాసు బిరుదు చోళేంద్రునివల్ల పొందినట్టిన్నీ శంకరవిజయమును రచించినట్టిన్నీ ఆలూరి కుప్పన్న తన్నుగూర్చి కృతిపతి చెప్పినట్లు ఈవిధంగా కొన్నాడు.

"పరగు రామాయణ భాగవతంబులు
యక్షగానముచేసి తద్భుతముగ."

పార్థసారథివిజయ మనేయక్షగానంకూడా యితడు వ్రాసినదే.

బలభద్రవిజయం వ్రాసిన సోమన్నకవి తనసంగతి ఈవిధంగా చెప్పుకున్నాడు.

"సుమహితంబుగ నేను సోమనాహ్వయుడ
బల్లాడచరితంబు పద్యకావ్యముగ
ఎల్లవారలు మెచ్చ ఏచేసినాడ.
అలశివరాత్రిమహాత్మ్యము తెనుగు
వలనుగా వచనకావ్యము చేసినాడ.
లక్షణదేవికళ్యాణంబు ద్విపద
యక్షగానంబుగా నమరించినాడ.
గంభీరమగు యక్షగానంబు శుకుని
రంభసంవాదంబు రచియించినాడ."

ప్రబంధకవి అయినయీతడు "లక్షణాపరిణయమూ" "శుకరంభాసంవాదమూ" అనేయక్షగానాలు వ్రాసినట్లు స్పష్టము.

మదనమోహినీ విలాసమూ, కాళిందీపరిణయమూ, ఉత్తరహరిశ్చంద్రకథా అనే ప్రబంధములు వ్రాసిన "తక్కెళ్ళపాటి లింగన్న" ఈవిధముగా చెప్పుకున్నాడు.

ఆ వెన్క విద్యుత్ప్రభావిలాసము వేడ్క
ఘటియించితిని యక్షగానరీతి.

శేషధర్మములు వ్రాసిన "గురురాజకవి" సంగీతవిద్వాంసుడు. ఇతడు, "ప్రతి పద్య యమకచిత్రశ్లేష పద్మావతీపరిణయనామ దివ్యనాటకంబును, అనిరుద్ధ చరితాహ్వయాంధ్రనాటకంబును వ్రాసినట్లు చెప్పకొన్నాడు.

ఉభయభాషాకవిత్వ చాతుర్యౌదార్య సకలకవిమిత్రుడైన "దరువూరి అప్పలాచార్యులు, ఇట్లా చెప్పకున్నాడు.

"......... హరి పేరకృతుల
దేవభాషను గొన్ని తెనుగున గొన్ని
ప్రావీణ్యమున జేసి భక్తి నర్పించి
యును దనియనిమతి నూహతో నిప్పు
డొనరించు నైరావతోత్తమచరిత
మను నామమున నొప్పనది యక్షగాన
మొనర శ్రీనరహరి కొసగ దలంచి,"

పురిజాల లక్ష్మీనారాయణకవి

"............రామభద్రనృపతి,
నన్ను దగినట్టిసంభావనలను దనిపి
కృష్ణునకు పారిజాత మంకిత మొనర్చి
చెప్పుమన యక్షగాన మే జేసితిట్లు,"

అని పద్య, గద్య, ద్విపద, పదభరితముగ రచియించినట్లు చెప్పకొన్నాడు. శివతత్వసారమును లక్ష్మణరావుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటిస్తూ శివతత్వసారప్రతిలో జగ్గుభట్టరచిత "సురాభాండేశ్వర" మున్నట్టుకూడా వ్రాసినారు. లేఖకుడు దానిని క్రీ. శ. 1800 లో వ్రాసినట్లు ఉన్నది. ఇది మిక్కిలి ప్రాచీనమైనయక్షగానమై యుండవచ్చు. ఆప్రతి ఇప్పు డెక్కడున్నదో తెలియదు.

వారణాసి అచ్యుతరామకవి 1776 వ సం. లో సురతానీపరిణయ మనేయక్షగానం వ్రాశాడు. ఆయక్షగానాన్నే తాను మరల ప్రబంధముగా రచియించినట్లు చెప్పు కున్నాడు.

అరయంగ నది సురతానీ
పరిణయమన యక్షగానపద్ధతిగా ముం
విరచింపంబడె నిప్పుడు
విరచింపుము గద్యపద్యమిశ్రితకృతిగాన్.

జీవద్భాషలో దివ్యమైనకృతులు వ్రాసిన త్యాగరాజు "నౌకాచరిత్ర" "ప్రహ్లాదచరిత్ర" అనే యక్షగానాలు వ్రాశారు. ఈయన తాతగారైన "గిరిరాజ"కవికూడా అనేకనాటకాలు వ్రాసినాడు.

కండచక్కెరలీల గల్పించి రుచుల
గండుమీరినయక్షగానంబు మిగుల
గరిమెను గిరిరాజకవి విరచించె

అని శాహేంద్రచరితమనే యక్షగానంలో చెప్పుకున్నాడు.

రఘునాథరాయలు, శాహరాజు, శివాజి, విజయరాఘవుడు, అనే తంజా వూరు రాజులుకూడా నాటకాలు వ్రాశారు.

పైవిషయాలను బట్టిచూస్తే మహాప్రబంధ కవులున్నూ, మహాపండితు లున్నూ, మహారాజులున్నూ, ఉభయభాషాపారంగతులున్నూ, ఈ యక్షగా నాలను వ్రాసేవారని స్పష్ట మవుతున్నది. ఇంతేగాకుండా వీటిని మహారాజులూ పండితులూ ఆదరించేవారనిన్నీ, ప్రజాసామాన్యమూ బుధులూ చూచి ఆనం దించేవారనిన్నీ స్పష్టమవుతూ వున్నది. దేవుళ్ళుకూడా వీటిని మెచ్చుకునేవారట!

వీటిని పూర్వకాలమున బాహాటముగా ఆడేవా రనటానికి నిదర్శనము చూపు తున్నాను. పింగళి సూరన్న ప్రభావతీప్రద్యుమ్నములో నాటకా లాడేవాళ్ళను గురించి యెత్తుకొని విమర్శించాడు. వజ్రనాభసభలో నాటకా లాడించాడు.

పాల్కురికి సోమనాథుడు వ్రాసిన బసవపురాణంలో శిరియాళచరిత్ర నాట కంగా ఆడేవారని యీవిధంగా చెప్పినాడు:

కర మర్థి నూరూర శిరియాలుచరిత
పాటలుగా గట్టి పాడెడువారు
అటుగాక సాంగభాషాంగక్రియాంగ
పటునాటకంబుల నటియించువారు.

క్రీడాభిరామంలో మాచల్దేవి వారాంగనను గూర్చి వ్రాస్తూ మంచనశర్మ నోట ఈమాటలు పల్కించబడ్డవి:

> లెస్సగాక కిరాట యీరేమచరిత
> మాడుదురు నాటకంబుగ నవనిలోన
> దీని జూడంగబోదమా యీనెపమున
> నరసి చూతము మనకేమి యచట ననుచు.

ఇది 1420–పది హేనవశతాబ్దాదియందలి విషయము. శ్రీనాథుని కాలంలో యక్ష గానాలు పాడుతూ, ఆడుతూ వుండేవారనడానికి యిదివరకే నిదర్శనాలు చూపి నాను.

తంజావూరురాజులకాలంలో ఈయక్షగానాలూ నాటకాలూ పుష్కలంగా ప్రదర్శించేవారు. ఇందుకొరకై రాజులు రాజభవనమందు నాట్యశాలలు ఏర్పాటుచేసి వాటిలో ఈనాటకాలను ప్రదర్శింపజేసేవారు. వీరికాలంలోనే రంగాజమ్మ మున్నగు స్త్రీలు నాటకాలు వ్రాసినారు. పైనాటకాలలో స్త్రీలుకూడా వేషాలు ధరించేవారు.

రఘునాథరాయలు

> " భరతవిద్యాధురంధరుడౌట, రంగస్థ
> లంబు రామాలంకృతం బౌనర్చె "

అనిన్నీ,

> " ఏరాజు వీటనమీాహితకర్నాట
> రమనాట్యవిద్యకు రంగభూమి "

అనిన్నీ,

> మాటలనేర్పులా సరసమార్గములా కొలువుండురీతులా
> పాటలగంధులా కళలభాగ్యములా బహుదానలీలలా
> నాటకశాలలా యొకటనకావలదెన్నిట చూడనన్నిటన్
> మేటియు కీర్తిలోలుడుసుమీా రఘునాథనృపాలు డిమ్మహిన్.

అనిన్నీ,

> భరతశాస్త్రప్రౌఢమార్గికలాస్య
> రసాస్వాదనకోవిదా !

అనిన్నీ విజయవిలాసంలో చేమకూరి వెంకన్న చెప్పినాడు.

ఇక యీయక్షగానాలు ప్రశస్తమైన సారస్వతశాఖ అనడానికి యేమైనా సందేహం వుంటుందా ?

అముద్రితాంధ్రవాఙ్మయసూచికనుపట్టి చూస్తే తెనుగులో 400 లకు పైగా యక్షగానాలున్నట్లు స్పష్టమౌతోంది. ఇందుసుమారు రెండు వందలు ముద్రితము లైనవి. మిగిలిన వముద్రితములు. తెలుగువాళ్ళ ఉదాసీనత కీటకరూపము ధరించి ఈయముద్రితదివ్యకావ్యఫలములను తినివేస్తూ ఉన్నది.

ఈయక్షగానాల్లో వాడినభాష జీవద్భాష, జాతీయం. వీటినిబట్టి ఆకాలపు సంఘమందలి ఆచారవ్యవహారములూ, ఆనాటివారి పలుకుబళ్ళూ తెల్లమవుతవి. అంతేగాకుండా ఆనాటిప్రజల వేషములుకూడా మనము తెలుసుకోవచ్చును. చరిత్ర పరిశోధనకూ, భాషాపరిశోధనకూ ఇవి గనులు.

కోలాచలం శ్రీనివాసరావుగారు 1911 వ సంవత్సరము ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో యక్షగానాలను గురించి ఈవిధంగా వ్రాసినారు.

"నన్నయార్యుని మొదలుకొని 19వ శకం అంతమువరకు నాంధ్రమున నాటకములు లేవని పలువురు పండితులు వాకొనుచున్నారు. ఇది విశ్వసనీయము గాదు. ఆంధ్రనాటకసాంఘికు లనేకు లుండిరి. వారు భాగవతభారతరామాయణాది గ్రంథ సంబంధకథలను సంపూర్ణముగా నాడుచుండిరి. గోపికాలీలలు, పారిజాతాపహరణము, విష్ణుమాయావిలాసము, సైంధవవధ, కీచకవధ, ద్రౌపదీవస్త్రాపహరణము, హరిశ్చంద్ర నలచరిత్రలు, సారంగధర కుమారరామచరిత్రలు, లేపాక్షిరామాయణము, ధర్మపురిరామాయణము, విద్యుత్ప్రభావిలాసము మొదలగు ఆంధ్రనాటకము లనేకము లుండెను. వీనికి యక్షగాననాటకములని ప్రసిద్ధనామముండెను. వానిని నాటకసాంఘికులు రాజగృహములలో నేమి, ధనికులయిండ్లలో నేమి, వీధులలోనేమి చక్కగా ప్రదర్శించుచుండిరి. ఈనాటకసాంఘికులలో అనేకులు పండితు లుండిరి. వారి(వంశస్థులు)యింటిపేరనమువా రిప్పటికి నచ్చటచ్చట నున్నారు. ఘట్టుదేశపువారు, లేపాక్షివారు, ధర్మపురివారు, భాగవతుల రంగయ్యగారు (కూచిపూడివారు) మొదలగువారు దేశదేశములూ సంచరించుచు నాటకము లాడి బహుమానము లంది మాన్యము లార్జించి పొగడిక గనినారు. వీ రాడుచుండిన నాటకములు కొన్ని యక్షగానములని యుచ్చొత్తింపబడినవి."

ఇక యక్షగానము రసవత్ప్రబంధమని నిరూపణచేయడానికి కందుకూరి రుద్రయ్యవ్రాసిన సుగ్రీవవిజయమనే యక్షగానాన్నిగురించి కొంచెముచెపుతూ వున్నాను. ఈసుగ్రీవవిజయంలో 38 సంధివచనాలు, 14 జంపెలు, 11 ద్విపద

మాలికలూ, 9 త్రిపుటలూ, 6 అర్థచంద్రికలూ, 5 అటతాళములూ, 4 గీతములూ, 2 సీసములూ, 1 ఉత్పలమాలా, 1 కురుజంపె, 1 ఏకతాళమూ, 1 కందము, 1 ధవళమూ, 1 ఏలపదమూ ఉన్నవి. దీన్నిబట్టి యక్షగాన లక్షణము కొంతవరకు మన మూహించవచ్చును. ఇందు మొదటిపద్యంలో త్రిమూర్తులను, వారిభార్యలను, విఘ్నేశ్వరుని, దేశికులను నుతించి, సుకవులను పొగడి, కవితాజడులను నిరసించాడు. తరువాత, కృతీశ్వరుడైన కందూకూరి జనార్దనుని త్రిపుటలో కొనియాడాడు. పిమ్మట అర్ధచంద్రికలలో షష్ఠ్యంతములు చెప్పి,

" అని యంకితంబుగా నాయొనర్పంబూనిన సుగ్రీవవిజయమనే యక్షగానమునకు కథాక్రమం బెట్టిదనిన " అని కథాప్రవేశం చేశాడు. దీనినిబట్టి యక్షగానములను ప్రబంధము లనుటకు కారణం తెలియుచున్నది.

ఇందలి కథ:

శ్రీరాముడు లక్ష్మణసమేతుడై ఋష్యమూకమునకు వెళ్లుట, సుగ్రీవుడు భయపడి హనుమంతుని పంపుట, హనుమంతుని రాయబారము, సుగ్రీవునితో స్నేహమూ, శ్రీరాముని బలప్రదర్శనమూ, వాలి సంహారమూ, సుగ్రీవపట్టాభిషేకమున్ను.

సీతను వెదకుతూ శ్రీరాముడు లక్ష్మణునితో పంపాప్రాంతమున సంచరిస్తూ వుండెను. అప్పుడు సుగ్రీవుడు వారిని జూచి ఇట్లు హనుమంతునితో అన్నాడు:

వీరు మనలను వధియింప వేషమొంది
వాలిపంపున వచ్చిన వారుగాను
నాకు గాన్పించుచున్నది, గాకయున్న
తాపసుల కేల శరచాపధారణములు.

అప్పుడు హనుమంతుడు ఈవిధముగా చెప్పాడు:

ఈమనోహరరూపవైఖరు
లిట్టి తేజము గలుగువారికి
భూమి నెటువలె దుష్టగుణములు
బొడమునయ్యా !
ఏను నచటికిబోయి వారల
పూని కంతయు తెలిసివచ్చెద
భానునందన వెరువ నేటికి
బంపు నన్నూ.

సుగ్రీవుడు హనుమంతుని పంపి భయంతో మలయాద్రికి పోయాడు. హనుమంతుడు రామలక్ష్మణుల సంగతి పూర్తిగా తెలిసి వచ్చి సుగ్రీవుడితో అంటున్నాడు:

......ఓకపికులాధీశ

ఆరూఢి నీ కనాయాసంబుకతన
శ్రీరాముడనెడి నిక్షేపంబు దొరకె
నింక నీయక్కర లెల్లను దీరె
గొంకక రఘురాము గొల్వ కేతెంచి—

సీతావియోగానికి దుఃఖిస్తూ శ్రీరాముడు ఈరీతిగా అనుకుంటున్నాడు:

త్రిపుట నన్ను విడిచియు నిలువజాలక
నాతి వచ్చితి వడవి దిరుగను
నిన్ను విడిచే నెట్టులోర్తును
నీలవేణీ !

రమణిరో నిను బాసినప్పుడె
రాతిరే శివరాతి రాయెను
నిమిషమైనను నాదుకంటికి
నిదుర రాక.

జంపె తరణికులమున బుట్టి శరచాపములు బట్టి
తరుణి గోల్పడుకంటె, మరణమే మేలు,
నను శౌర్యవంతుడని తనపుత్రి నిడినట్టి
జనకవిభు డీవార్త విని వగవకున్నె ?
ఒకట నొచ్చములేక నున్న రవివంశమున
కకట నాచే యింత యపకీర్తి వచ్చెగా.

పిమ్మట శ్రీరాముడు సుగ్రీవునితో స్నేహంచేసి వాలిని బాణంతో కొట్టాడు. అప్పుడు వాలి శ్రీరామునితో అంటున్నాడు:

"నను బేరుకొని పిలిచి నాముఖాముఖి నిలిచి
జననాథ పోరాడి జంపలేవైతి.
పొంచివేసితి రామభూపాల ! నృపధర్మ
మెంచికోలేవైతి వెంత జేసితివి.
శ్రీరామ నీరామ జెరగొన్న రావణుని
వారిధుల ముంచితిని వాలమున జుట్టి.

ఒకమాట నాతోడ నొనరంగ దెల్పవై
తట రావణుని దున్మి యాసీత దేనె?"

వాలిమూర్ఛనొందినసంగతి తారకి తెలిసింది. దుర్భరదుఃఖముతో ఆమె వారి వద్దకు వచ్చి విలపించింది. సుగ్రీవుని దూరింది; శ్రీరాముణ్ణి చూచి యీవిధముగా చెప్పిపాడుస్తోంది:

ఆలి చెరగొనిపోయినట్టి దశాస్యుడుండగ నిర్నిమిత్తము
వాలి నేటికి జంపితివి రఘువంశతిలకా
న్యాయ మేటికి దప్పితివి నరనాథ జానకితోడనే చెర
బోయెనే నీరాజనీతియు భూరిమహిమల్.

వాలి మూర్ఛ తెలిసి అంగదుణ్ణి ఊరార్చి రాముడితో యీవిధంగా అంటున్నాడు:

ఓమహాత్మ ! దయాపయోనిధి ! రామ !
భూమితలేశ నాపుణ్యా మెట్టిదియొ
నీచేత మృతినొంద నేడు తుర్యాశ్ర
మాచారపరులకు నందగారాని
వైకుంఠపదవి నిర్వక్రింబుగాగ
గైకొంటి నాపాతకములెల్ల బాసె,
భానువంశాధీశ భవనాశ రామ
ప్రాణముల్ నిర్వహింపవు మేన నింక
బాణంబు దీయవే పార్థివోత్తంస !

అనగా రాముడు చేరవచ్చి,

......నిజభుజాఖర్వదుర్వార
త్రైలోక్యరక్షణ ధర్మప్రశస్తి
నెలమి పెంపగునట్టి నిజహస్తమునను
కపికులాధీశు వక్షము గాడియున్న
విపులసాయకము బల్విడి పెల్లగింప,

వాలి యూర్ధ్వలోకమునకు పోయెను. కపు లప్పుడు సుగ్రీవునకు కనకకుంభముల నభిషేకము జేసి,

అర్ధచంద్రి కలు ఫాలమున బంగారుపట్టమును గట్టి
అరుదంద రత్నసింహాసనముమీదన్
ప్రేమచే గూర్చుండ పెట్టిర వ్వేళ

పుణ్యాంగనలు ధవళములు పాడిరట; ఎటువలెను:

> శ్రీరాముడు, గుణధాముడు, వారిజలోచనుడు
> శూరత రావణు గూలిచి నారీమణి దేవలయుగా
> రామునిగృప కపిరాజ్యము క్షేమంబున బాలించే
> శ్రీమంతుడు సుగ్రీవుడు భూమండలి బొగడొందుగా.

అపుడు సుగ్రీవుడు శ్రీరామునకు కానుకలు తీసుకొనివచ్చెను. ఆ గిరిప్రాంతాలలో ఉండే చెంచీతలు ఈవిధముగా ఏలలు పాడిరి:

> భానువంశమున బుట్టి
> దానవకామిని గొట్టి
> మౌనివరులు సన్నుతించగా, ఓరామచంద్రా!
> పూని మఖము నిర్వహింపవా
> రాతి నాతి జేసి పురా
> రాతి చేతి విల్లు విరచి
> భూతలేంద్రులెల్ల మెచ్చగా, ఓరామచంద్రా!
> సీతను వివాహమాడవా?

పైని ఉదాహరింపబడ్డ గ్రంథభాగములనుబట్టి చూస్తే "సుగ్రీవవిజయ" మనే యక్షగానము ఎంత రసవత్తరమైనదో బోధపడుతుంది.

యక్షగానాలలో, అందులో ముఖ్యముగా "భామవేష" మనే పారుజాతంలో ముద్దులు మూటగట్టేవచనా లున్నాయి. శిష్టులూ, పామరులూ, స్త్రీలూ, వీరికి తత్తదుచితభాష, జీవద్భాష వాడబడ్డది. మచ్చుకు "భామవేషం" లోంచి వచనం ఒకటి ఉదాహరించి వ్యాసము ముగిస్తాను. *

శ్రీకృష్ణుడు కనపడక సత్యభామ విరహబాధపడుతోంది. కలలు కంటోంది. ఒకనాటి స్వప్నవృత్తాంత మామెచెలికత్తెతో ఇట్లు చెప్పుతోంది.

ముచ్చట:

"వోయమ్మా వకావకనాడు పడుకమందిరములో హంసతూలికాతల్పమందు కేళికాగృహములయందు వజ్రవైడూర్యగోమేధికపుష్యరాగమరకతమాణిక్య

* యక్షగానాలను గురించి తెలుసుకోదగ్గ విషయాలు ఇంకా చాలా ఉన్నవి. తంజావూరు భాండాగారాలలో ఉన్న యక్షగానాలు చదివితేనేగాని వీటి పరిణామ పద్ధతి తెలుసుకోవడం కష్టం. కొన్ని యక్షగానాలు భాగవతుల నోళ్లలోనే ఉన్నవి. కొన్ని తాళపత్రాలలో ఉన్నవి. వీటిని పోగుచేసేభారం నవ్యసాహిత్య పరిషత్తు వహించాలి.

ములు స్థాపించినటువంటి నగరియందు పవళించియుండగా స్వామివారు వచ్చి గానంచేసినారమ్మా, నేను గాఢాంధకారమైనటువంటి సుషుప్తిలో ఉండగా కన్ను తెరిచినానమ్మా, అంతట స్వామివారు వచ్చి శయ్యమీద కూర్చున్నారమ్మా, నాకు కలతనిద్దరసమయంగనక దిగ్గన లేచినానమ్మా, లేచి పరిమళద్రివ్యములు మొదలైన చందనగోష్టిచేసినానే, అంతట స్వామివారు పరున్నారే, నేను కూర్చున్నానే, పాదసేవచేసినానే, అప్పుడు స్వామివారు నన్ను తొడలపైన కూర్చుండబెట్టుకుని, అమూల్యమైనటువంటి ఆభరణములు అలంకరించి, నిలువుటద్దం తెచ్చి యెదటఉంచి నీడలు చూచి, సత్యభామా! నీవే చక్కనిదానవా నేనే చక్కనివాడనా, అని అడిగేనే వోశమ్మా! – అడిగేటువంటివరకు, ఆడబుద్ధి అపరబుద్ధి గనుక, అబలలముగనుక, తెలియక నేనే చక్కని దాననంటినే వోశమ్మా! – అంతట స్వామివారు నామీద చాలాకోపంచేసి దిగ్గున లేచి చక్కాపోయెనే వోశమ్మా! మనస్వామివారు యెందుబాయెనో, యెక్కడబాయెనో వెదుకుదామలే వోశమ్మా!”

సత్యభామ తాళలేక చెలికత్తెను పిలిచి శ్రీకృష్ణునిదగ్గిరికి రాయబారం పంపుతోంది. ఆసందర్భంలో ఆమె చెప్పిన మాట లివిగో:

“నల్లనివాడో యమ్మా। నాప్రాణసఖుడమ్మా
కొమ్మరో వేగమె బొమ్మ। గోపాలరాయుని తోడి తేగదవమ్మా,

అని దర్వు పాడి వచనం చెప్పుతోంది.

“వోశమ్మా అందాకా పోయివస్తావుటమ్మా! స్వామివారిదాకానే కృష్ణమూర్తి దాకానమ్మా ద్వారకదాకానే కైలాసందాకానే వైకుంఠందాకానే రాయబారంగా పోయిరావే, అనుసంధానంగా పోయిరావే; స్వామివారినీ నన్నూ కూర్చవే కుచ్చులదండ లిస్తానే, చేర్చవే చేర్చుక్కబొట్టు యిస్తానే, స్వామివారిని తీసుకురావే వెంటబెట్టుకురావే తోడుకురావే, ఏడువారాల సొమ్ము లున్నవమ్మా- వకవారం పెట్టినసొమ్ము వకవారం పెట్టకుండా ఏడువారాలకు ఏడు ముస్తాబుల సొమ్ముగాదటమ్మా – పెట్టెలో పెట్టి ఒక పెద్దపెట్టెలో ఏడు చిన్నపెట్టెలు పెట్టినారమ్మా, పెద్దపెట్టె భోషాణంలో పెట్టినారమ్మా, భోషాణంగదిలోపెట్టితాళం వేసినారమ్మా, పెట్టె నాదగ్గిరే ఉన్నదమ్మా చెవి స్వామివారి ఆధీనంగా వున్నదమ్మా, వోశమ్మా అదియెట్లా యిత్తునమ్మా!”

*

# కపాలమోక్షం

శ్రీరంగం నారాయణబాబు

వేదసన్నిహితు
ఆదిశంకరుని
తపస్సమాధిని
ఓంకారమ్మే
హుంకరించినది.
చలించినవి
చరాచరమ్ములు
భూతా లుద్రేకించినవి.
కాటుక పెట్టిన
నయనేంద్రియమ్మై
కర్మసాక్షియే
పోటు లురిలాడు.
అభ్ర గంగలో
శుభ్ర వీచికల
హాలహాలమ్మే
తల యెత్తింది.
శేషుని ఫణాల
మణుల కాంతులు
పీసర వోయినవి.
పూదోటలు లేనే లేవు
వసంతములు రానే రావు.
ముల్లోకంబుల
తబిసి మిన్నలు
ముర్ఛరించినారు.
అనంతకోటి
జీవరాసులు
హాహాకారం చేశాయి.
హారోం హారాయని
పాహి పాహి యని
ప్రణమిల్లాయి.
అర్ద్ర మైనది
ఆ మహామహుని
అంతః కరణం.
అంతట అక్షులు విప్పి
ఆ,లి ఆకలి అంటూ
భిక్షాపాత్రకు
చేయి చాపినాడు.
ఉగ్రతపస్సున
మ్రగ్గినది.
వేడి కంటికి
సూడిద పెట్టిన
బ్రహ్మ కపాలం
పట పట
పళ్ళు కొరికినాడు
నటరాజు;
భూత పిశాచాల్
బొబ్బరిల్లినవి
వందిమాగధులు
వణికారు.
భయపడి బసవడు
రంకె వేసినాడు.
భూలోకమ్మున
తురకల గోరీలందు
క్రైస్తవుల సమాధులలోన
హిందూ శ్మశానవాటుల

కపాలమ్ములు
కిక కిక నవ్వినవి;
పుణికలు
పులకరించినవి;
కంకాళమ్ములు
ఘల్లున మ్రోగినవి;
శ్వేత పర్వతపు
శిఖరాంచలముల
కనకభాండమే
కదిలింది.

స్వాహావల్లభు
సువర్ణ గర్భం
సళుపరించినది
కళవళించినది.

గంగవతమే
పాల పోటుతో
సింధు గర్భమున
గంగ కడుపులో
లవణ సాగరపు
లోతుల్లో
దాగిన నేత్రాగ్ని
మానవరూపం దాల్చింది.

మన్నే వెలిగించింది,
మిన్నే పొగచూరింది,
మంటల్లోనే పుట్టాడు,
మంటల్లోనే పెరిగాడు,
మంటల్లోనే మడిశాడు.

అగ్ని వీణయై
భగ్న కంఠమై
భగ్న గీతియై
తారకమంత్రం
పరంజ్యోతిగా
వీరశైవుడు
భారతవీరుని
కపాల మొక్కటి
కపర్ది చేతికి
రివ్వున వాలింది.

కెవ్వున కేకేశాడు
కంఠే కాలుడు,
ఫాల నేత్రమే
స్పందించింది.

అండపిండ
బ్రహ్మాండమ్మంతా
తాండవనృత్యం చేసింది,
ఆనందాశ్రుల నించింది.

శేషుని ఫణాల
మెత్తనికయ్యి
పుడమి
ఒత్తిలిగింపింది
ఎడారి పుష్పించింది.

ఎందరు పుట్టలేదు
ఇంకెందరు గిట్టలేదు
అందరికీ
లభియిస్తుందా
హాలహాల మంటిన
హస్త స్పర్శ,
పెదవుల చుంబనము,
కపాల మోక్షం,
కపాల మోక్షం !

[ 'యుగరజ్యోతి' నుంచి ]

*

# సాహిత్యతత్త్వము

మాధవరామశర్మ

మానవుడి జీవితలక్ష్యము ఆనందము. దుఃఖమునూ దుఃఖసాధనములనూ పరిత్యజించాలని ప్రాణికోటి నిత్యమూ తలుచుకొంటుంది. సుఖమూ సుఖసాధనములూ కావాలనే ఆశ ప్రబలంగా పెరుగుదల పొందుతుంది. మానవునకు దుఃఖధ్వంసము ఒకటే కాదు కావలసింది; దానితోపాటు సుఖమూ అపేక్షలో ఉండక తప్పదు. తనకు కలిగే సుఖములో దుఃఖగంధము స్వల్పముగానైనా ఉండరాదు. దుఃఖసంబంధములేని సుఖమే ఆనందము. సాహిత్యము ఆనందప్రదము: అందువలన సాహిత్యము ఉపాదేయము.

ప్రాచీనకాలములో ప్రతిభానిష్యందముతో కూడుకొన్న ప్రజ్ఞాచక్షుష్కులు ఆనందానుసంధానము చేసినారు. వారివారి ధీరప్రజ్ఞకు గోచరించినట్లుగా సాధన సామగ్రిని సంపాదించారు. ఎన్నిశాస్త్రాలు, ఎన్నిగ్రంథాలు, ఎన్నిమార్గాలు బయలుదేరినా వాటికి ప్రాప్యం ఆనందమే. సాహిత్యము విశ్వానందము; సాహిత్యములో విశిష్టత ఉన్నది. అనేక శాస్త్రసముదాయమే సాహిత్యము. ఈశబ్దవ్యుత్పత్తిపరమార్థము ఇంతే ఇది సముదాయరూపమైనా విశిష్టమయిన అఖండ తత్త్వము.

వేదములకూ శాస్త్రములకూ ఇంకా ఇతరములకూ ఒక్కబుద్ధివికాసమే ఫలం కాదు. వికాసం పొందిన నిర్మలబుద్ధిలో గోచరించే స్వరూపానందమే ప్రధాన ఫలము. ఇదే ఫలం కాకపోతే, ఇంతటిదీర్ఘకాలజీవితం వాటికి ఉండదు. సాహిత్యముకూడా స్వరూపసమావేశమును సంపాదించుతుంది. అందువల్ల సాహిత్యము ఆనందపర్యవసాయి.

స్వాత్మసమావేశమువలన గలిగే ఆనందమును పొందటానికి సాహిత్యేతర మార్గాలున్నవి. లక్షణశోభతో ప్రకాశించే సాహిత్యం అపరిహీణధర్మమే. ఇతరమార్గాలు ఏకైకరూపాలు. సాహిత్యము సమగ్రసంపత్తితో ఉన్న సమష్టి తత్త్వము.

ఇతరశాస్త్రాలకు జగత్తులో స్వీకరింపవలసినది లేదు. జగత్తు వాళ్ళకు నశ్వరం. క్షణికం. అంతేకాక హేయమూను. జగత్తును విడిచిపెట్టి శాస్త్రాలు సాముగరిడీలు చేసినవి.

---

గుంటూరులో జరిగిన నవ్యసాహిత్యపరిషత్తు పంచమసమావేశములోని ఉపన్యాససారసంగ్రహము.

జగత్తుతాటస్థ్యం వాటిలో పరమార్థం. సాహిత్యంలో జగదైకస్వభావసమున్మీలన మున్నది. ప్రవృత్తిమార్గాన్ని విడిచిపెట్టి నివృత్తిసుఖము పొందవలసినది అని కొందరు, ప్రవృత్తిపథపరిత్యాగం లేకుండా నివృత్తినిర్వృతిని పొందవచ్చు అని 'కేచన' అంటారు. సాహిత్యము ద్వితీయమార్గాన్ని అవలంబించుతుంది. మహాప్రకృతి అంతా సాహిత్యములో మధురలాస్యం చేస్తుంది. నిఖిలజగత్తూ సాహిత్యశిరోమణికి ఉపాదానము.

వేదము అపౌరుషేయము. అనంతపథములో పరానాదరూపముగా ఉన్న ప్రణవస్వరూపమును అంతర్ముఖవిజ్ఞానముతో అవగాహనము చేసుకొన్న అంతర్జ్ఞానులు వేదాలను ప్రకాశింపజేసినారు. వేదాలలో పురుషుని స్వాతంత్ర్యభావాలకు అవకాశము లేదని వేదద్రష్టలైనవాళ్ళు స్వేచ్ఛను ప్రకాశింపజేయటానికి వీలులేకపోవటమువలన వేదాలపౌరుషేయములని కొందరంటారు. ఏవిధంగా నయినా సరే వేదాలుమట్టుకు అపౌరుషేయాలు.

శాస్త్రజాలం అంతా పౌరుషేయం. ఒక్కొక్క శాస్త్రప్రణాళికను అమలులో పెట్టిన పురుషుడు తన స్వేచ్ఛను అడ్డు లేకుండా ప్రదర్శించాడు. స్వాతంత్ర్యప్రజ్ఞతో స్వరూపానందానికి సముత్తేజనమును సంపాదించాడు. ఒక్కొక్క శాస్త్రకారుడికి ఒక్కొక మార్గం. కొన్ని స్థలాలలో ఇతరానుసరణము ఉన్నవారు 'ఒరిజినాలిటీ' చూపించారు. పురుషేచ్ఛ వాటిలో బింబించింది.

సాహిత్యము పౌరుషేయమూ అపౌరుషేయమూను. ఉభయసామరస్యముతో సాహిత్యము సముల్లసిత మయినది. అపౌరుషేయ మయిన వేదములోని ఆనందమును సాహిత్యము అందుబాటులో ఉంచుకొన్నది. సాహిత్యములో అంతటా ఆనందతేజమే ప్రసరించుతూ ఉంటుంది. అందువలన అపౌరుషేయము. పురుషేచ్ఛను సంపాదించుకొన్న రచనాసౌష్ఠవము, కల్పనాప్రౌఢిమ ఉండుటవల్ల పౌరుషేయము. పౌరుషేయత్వమూ అపౌరుషేయత్వమూ పరస్పరము భిన్నధర్మము లయినా ఆదిదంపతుల మాదిరిగా కౌగిలింపులో గుమికూడి ఏకభావమును పొందినవి.

సాహిత్యతత్త్వంలో జగత్తుకు తటస్థభావము లేదు. ఇందులో జగత్తు సర్వథా సర్వదా అనుసరింపబడవలసినదే! ప్రతి అణువూ సాహిత్యతేజానికి ఇంధనము. సాహిత్యమార్గంలో జగత్తు నీరసమూ, అశాశ్వతమూ, నశ్వరమూ, క్షణికమూ కాదు. ఈభావాలు ఇక్కడ కలుగనే గలుగవు. ప్రతిపదార్థమూ ఇందులో ఆస్వాద్యము అవుతుంది. ఈదృష్టిలో జగత్తు అంతా రససిద్ధిని పొందుతుంది.

వేదాలు విశ్వపూరుషతత్వమును ప్రతిపాదనము చేసి విరమించినవి. శాస్త్రాలు ఆతత్వమును లక్ష్యముగా చేసుకొని మనోరసముతో రమించినై. సాహిత్యము అన్నిటినీ కబళించుకొని మించిపోయినది. వేదవిజ్ఞానమే శాస్త్రాలలో వేరొక స్వరూపమును ధరించింది. వేదధర్మము అనుస్యూతము కాకపోతే వాటికి స్వతంత్రప్రజ్ఞ లేదు. శాస్త్రము హితముగా ధర్మవును శాసించి చెపుతుంది.

శాస్త్రరహస్యము సాహిత్యములో కేంద్రీకరింపబడింది. శాస్త్రములు కర్కశ పద్ధతిలో ప్రసరించి వేదరహస్యమును దాచుకొన్నవి. వాటిలో నిగూఢమైన తత్వము సాహిత్యములో స్ఫుటస్వరూపమును స్వీకరించింది. వేదాలను వడబోయగా శాస్త్రములు వెలువడినై. శాస్త్రాలను మూటకట్టి పిండగా సాహిత్యరసము స్యందించింది. దుర్గమ శాస్త్రరీతులు సాహిత్యములో కుదించుకొని కళా విలాసమును పొందగలిగినవి.

సాహిత్యము నీరసము కాదు; కటువు కాదు; గడు భూతము కాదు. శాస్త్రాలలో మాదిరిగా ఇందులో కణుతులు లేవు. సాహిత్యము నవసరము; నిత్యనూతనము దీనిలో ఏదీ పునరుక్తముగా ఉండదు. ప్రియాస్వాదము ఎవరికి పునరుక్తమవుతుంది? సౌందర్యసారము సాహిత్యము; విశ్వసాహిత్యము సౌందర్యము. సుందరపదార్థం ఎవరికి ఇష్టంకాదు? మానసికశక్తులు శాస్త్రాలలో విజృంభించినవి. ఒకసూక్ష్మము ధర్మాన్ని అనుసరించిన అనేక కల్పనావిధులు శాస్త్రాలలో స్థిరాసనములు వేసుకొన్నవి. సంకల్ప వికల్పముల పాటవము వాటిలో పరిఢవించినది. ప్రతిభాదారిద్ర్యము శాస్త్రాలలో ఉన్నదనను కాని సరళరసమార్గము వాటిలో లేదు అనక తప్పదు. శాస్త్రాలధోరణికి ఆధోరణి ఆధారము అవసరం.

సాహిత్యములో ఆత్మధర్మములు ఆనందము సుఖాసనముతో అవతరించినవి. హృదయధర్మములకు సాహిత్యములో వికాసము ఉన్నది. సాహిత్య సరణిని అనుసరించిన సహృదయుడు తన హృదయతంత్రులన్నీ సమరసములై అనాహతముగా ఆనందగానమును చేయుటకు భావించగలుగుతాడు.

సౌందర్యము అక్కరలేదనేవాళ్లుండరు. కళావిన్యాసమును కోరనివారు లేరు. ఆనందమును భిక్షింపని భిక్షుకుడుండడు. సాహిత్యరసమును ఆస్వాదింపదలచనివాళ్ళుండరాదు. మహాంధకారమగ్నులను దివ్యధామము చేర్చటానికి సమర్థమయిన చల్లని సాహిత్యదీపమును హృదయము కలవాడు చల్లార్పడు. సాహిత్యాన్ని విడిచిపెట్టి జీవకుసుమాన్ని వాడింపజేసుకోవద్దు. దీన్ని ద్వేషించి ప్రాప్యానికి పరమదూరులు కావద్దు. నిత్యసన్నిహితమైన దీని తత్వమును తెలుసు

కొంటే జీవితము వికసించుతుంది. ఈర్ష్యాళువులు దీనిమీద వారి సంకుచిత కుదృష్టిని ప్రసరింప జేయవద్దు. పురోభాగులు దీనివిషయమై కలుషమనస్కు-లయితే వారు అభాగులే అవుతారు.

రసము ఆనందము. సాహిత్యానికి రసపర్యవసాన మున్నది. రసమే సాహిత్యము, సాహిత్యమే రసము. పురుషార్థచతుష్టయములో కూడుకొన్న విశిష్టానందము సాహిత్యప్రాప్యము. సాహిత్యానుయాయులకు ప్రపంచ మంతా పేశలముగా, లలితముగా గోచరించుతుంది. భావప్రపంచములో అన్నీ కుసుమసుకుమారములే. సాహిత్యసంధాత రమణీయములకు ఐక్యమును సంపాదించుకొంటాడు. అతనిదృష్టికి నిమ్నోన్నతభాగాలు కనబడవు. విశ్వపాషాణమును కరగించే మోహన సంగీతమును సాహిత్య ద్రష్ట సమన్వయించుకొంటాడు. అప్పుడు జడపదార్థముల కలమధుర సంగీతము కూడా అతనికి వినబడుతుంది. అప్పుడాతడు కవి. తనలోనుంచి అపుడు బయలుదేరిన ప్రతిభాభారతిని “కవిత్వము” అని ప్రాజ్ఞలోకము వ్యవహరించుతుంది. శబ్దార్థముల స్వరూపశోభ కవితాసృష్టిలో ఉపాదానసామగ్రి. శబ్దానుసంధానములో కవి గానకళను సన్నివేశింపచేస్తాడు. దానిలోని అపూర్వగానమే అపూర్వార్థమును ఉద్యోతింపజేయగలుగుతుంది. ఈశబ్దార్థములు రెండూ సహితభావముతో రసప్రతిపాదనమును జేయగలుగుతవి. ఈఉభయసన్నివేశము రససిద్ధిహేతువు.

సాహిత్యదృష్టిలో జగత్తు రమ్యతను పొందుతుంది. భిన్నభిన్నలోకములు కూడా ఏకభావమును పొంది సాహిత్యమహిమను స్పష్టముచేయుట సహృదయులకు తెలియనిది కాదు. భౌతికజగత్తులో స్వర్గీయానందము తామిస్రలోకములో జ్యోతిఃప్రకాశము సాహిత్యాధీనమే. సాహిత్యద్రష్టకు జగత్తులో కవితాదృష్టికి పనికిరాని వస్తువు లేదు. ప్రకృతి నానాధర్మములతో ఉండినా, సాహిత్యములో ఉపయోగమును సంపాదించుచున్నది. ఉత్తమవైద్యునికి అక్కరలేని ఓషధి లేనట్లు కవికి అనుపాదేయములేదు. కవిదృష్టిలో సమభావ మున్నది. మహాప్రకృతిలో సాహిత్యవేత్తకు విరోధము లేదు. నిఖిలపదార్థములు సమరసములై గోచరించి విశిష్టధర్మముతో ప్రకాశించుతూ “అహమహమిక”తో కవిచిత్తవృత్తిలో గోచరము లవుతయి. అతని నిర్మలదృష్టిలో రంగులేదు.

సాహిత్యతత్వములో నిరవలంబమైన నివృత్తి సుఖము వేరుగాను ప్రవృత్తి వేరుగాను ఉండదు. ప్రవృత్తినివృత్తులు రెండును ఐక్యమును అనుసంధించుకొని ప్రకాశించుతవి. సాహిత్యప్రాప్యమును భావన చెయ్యలేని అసమర్థ శ్రోత్రియులు భిన్నవాదములు చేసినప్పటికీ కళంకము లేదు. వారు అంతఃప్రజ్ఞతో ఐక్యభావ

మును అవగాహనముగా చేసికొనజాలరు. సార్వపధీనమై గోచరించు ప్రవృత్తి పథములో సంచరించుటకు సమర్థులైన ఛాందసులు నివృత్తిపరానందమును సమన్వయము చేసుకొనజాలరు. ప్రవృత్తిప్రణాళికలోని పదార్థములే వారికి గోచరించి వారి మనస్సును కలతబెట్టినవికాబోలు !

నవ్యసాహిత్యపరిషత్తుకూడా ఈవిశిష్టసాహిత్యమును మధ్య ఇమిడ్చికొన్నది. తన కర్తవ్యధర్మమును ఇది మరచిపోరాదు. కేవలము పదాలు గీతాలు పద్యాలు పొట్టి కథలు మాత్రమే నవ్యసాహిత్యంకాదు. పదాలు వగైరాలకే అయితే, పరిషత్తు అవసరంలేదు. గోష్ఠిమాత్రము అప్పుడుచాలు. లోకసంగ్రహమునకు పనికివచ్చేరీతులను ఈ పరిషత్తు చూపించాలి.

సామరస్యము అక్కరలేదనేవాళ్ళకు ఈమాటలు వెగటుగా ఉంటవని తెలుసు. సమష్టిమహదానందమును అభిలషించుచున్న నవ్యసాహిత్య విద్వాంసులకు, అది బిభీషిక కాలేదు. వ్యష్టివిధానములో జీవశక్తిలేదని తెలుసుకొన్న వాళ్ళు సామరస్యవిషయమై సమంజసభావముతో ఉంటారు. సామరస్యమనే మాటను చూచి బెదిరేవారలకు మాటలో మంచిదనము ఉండదుగాని వారినిత్య జీవనమంతా సమరసాకారమే. ఈరకంవారు అనుభవాన్ని అపలపించే ఆశాహతులు. ఆవేశముతో "సామరస్యము పనికిరాదు" అనే అకామహతులు "ఆనందో బ్రహ్మ"యటన్న ప్రాజదువు నంతగ్బుద్ధినూహింపక దైవమునె నిరసించుచున్నారు.

ఇతరపరిషత్ప్రపంచములో బండరాతిని పగులగొట్టి పటకారుతోబయటికి తీసిన మూగరత్నము లున్నవి. నవ్యసాహిత్య పరిషత్తు సమరసభావముతో అనుకూలమైన ఉపభోగవిధానములను అన్వేషించుచున్నది. సాహితీతత్వసముస్మేషములో సామరస్యము వజ్రలేపాయితమే, అయినా అది అందుబాటులో ఉండి అనుకూలము కావాలి. సాహితీసారములో విశిష్టసౌందర్యమే కావాలి. కాని ఒకలేశమును ఆమోదించటం భావకులకు అంగీకార్యముకాదు.

నవీనదృక్పథములో, బహిరంతర్విజ్ఞానములకు ఐక్యమున్నది. కార్యరూపముగా బయలుదేరు ఈఐక్యమును ఉబికిన హృదయముతో, లోకము అనుభావ్యము చేసుకొన గోరుచున్నది. భావకుల రెపరెపమను సాహిత్యములోని ఆకలి నవ్యసాహిత్యపరిషత్తును భిక్షింపచేయుచున్నది. దీనికర్తవ్యమార్గము వక్రము గాకుండుగాక !

సాహితీహృదయము మర్మస్థానము. అర్థవచ్ఛాస్త్రములు ప్రత్యేకమార్గములలో బయలుదేరినా దీనిని గమ్యము చేసుకొన్నవి. ఈసాహిత్యదర్పణములో శాస్త్రము లన్నీ స్ఫుటరూపముతో కూడుకొన్న శాస్త్రీయాణువులు కేంద్రీకరణము పొంది సాహిత్యసరణిలో సమన్వయము పొంది సామరస్యముతో కూడుకొన్నపుడు అభివ్యక్తమయిన సిద్ధలక్ష్యమును లోకము విప్పారి వేయికన్నులతో ప్రతీక్షించుచున్నది.

నానావిధ మతములలో ఐక్యము అపేతమయినా, కృషిచేసినప్పుడు నవ్యసాహిత్య పరిషత్తుకు అది అందరానిది అని అననుగాని, అంతకన్న అవసరాపేక్షితమును పరిషత్తు మరువరా దని మనవి.

వ్యాకృతిలో, మీమాంసలో, న్యాయపద్ధతిలో, ఆర్థికాంశములు (శబ్దములను, అర్థములను అనుసరించిన విషయములు) అనేకము లున్నవి. ప్రత్యేకశాస్త్ర దురభిమానముగలవారు సమర్థనా ప్రపంచోక్తిని వెలువరించుచు అనేకధా వివదించుటవలన ఏర్పడిన అనర్థము సాహితీహృదయములో కలుక్కుమనుచున్నది. ప్రత్యేకశాస్త్రాధ్యేతలు నిరస్తమరహంకృతులగుటకు, ఈపరిషత్తు చాలినీ న్యాయమును అనుసరింపకతప్పదు. భిన్నభిన్న శాస్త్రములలో సమన్వయము కుదురదని కొమ్ముపట్టినవారు పలికితే బెదరనక్కరలేదు. ఆయాశాస్త్రములలోని ఆర్థిక భాగములకు అవసరమైన ఆంధ్రానువాదము అందుబాటులో ఉండేభాషలో ఆవశ్యకము- అనేవిషయమును పరిషత్ప్రణాళికలో చేర్చికొనకపోతే ఆంధ్రదేశములో ఇది రెండవ పరిషత్తు అవుతుంది.

నవ్యసాహితీప్రవాహములో కూల ముద్రజమైన ధారాగతిసౌందర్యము- సౌభాగ్యము- ఆస్వాదము ఏవిధముగా ఉన్నదో రుచిచూపుటకు తగిన వ్యంజన సామగ్రిని ఈపరిషత్తు తయారు చేయక తప్పదు. సాహిత్యతత్వము, అలంకారశాస్త్రము, అలంకారశాస్త్రతత్వము, సాహితీహృదయము, వీటికి అవినాభావసంబంధ మున్నదని సహృదయలోకము తెలిసికొనకపోలేదు. అయినా అల్పసంతోషమును పొందటమువలన అధన్యము, ముగ్ధము, అనాలోకము అయినది. రెండు మూడు పిచ్చిపిచ్చి అలంకారగ్రంథములు ఆంధ్రానువాదములో ఉన్నవాటియందు కూడుకొన్న అనవసరమయిన చాదస్తపుధోరణి వెగటు కలుగజేయుటమువలన ఆంధ్రమండలి నైరాశ్యము పొందుచున్నది. ఈనవ్యసాహిత్యపరిషత్తు దీనికి మంచి మందును వెదుకవలయును. సంస్కృతాలంకారగ్రంథములలో ఆంధ్రభాషకు అక్కరలేని కొంత తుక్కు ఉన్నది. దానిని పరిశీలించుటలో ఈసాహితీగోష్ఠి సామరస్యమును పొందవలయును.

ఉత్తమసాహిత్యతత్వము మనకు కావలె ననుకొన్నపుడు, మనసాహితీసరణి నిష్కంటకము కావలెననుకొన్నప్పుడు, సాహితీనవనీతమును చవి చూడవలె నన్నప్పుడు, సంస్కృతభాషలో ఉన్న సరసమైన అలంకారగ్రంథములకు ఆదరింపదగిన ఆంధ్రభాషలో, అవసరమైన అనువాదమును నవ్యసాహిత్యపరిషత్తు చేయించుటకు పూనుకొనకపోయినప్పుడు ఈపరిషత్తు ఇంతేనా అని లోకము అనుకొనక తప్పదు. ఈపరిషత్తు ద్వితీయమైనా అద్వితీయము కావాలి; ఈనవ్యసాహిత్యపరిషత్తు "ఆంధ్రలోకానికి మూడనపరిషత్తు అవసరము కాదు" అనిపించాలి. అప్పుడు మన మందరమూ ధన్యులము.

*

# ప్రశ్న

మల్లవరపు విశ్వేశ్వరరావు

తూగాడు తరంగాల
ఊగాడు రాగమాల
ఏగాలి మర్మరాల
రేగెనో ?
ఏ దూర తీరాల
మ్రోగెనో ?

మోజైన ఆకుతెరల
రాజిల్లు పూవుబాల
ఏ తేటిపాట గరగి
పిచ్చెనో ?
ఏ తేనె తేటవలపు
లిచ్చెనో ?

పొంగారు సంజమొయిలు
రంగారు కావిహొయలు
ఏ దేవశిల్పి కుంచె
చిల్కెనో ?
ఏ దేవి గండ రక్తి
లొల్కెనో ?

నా నిదుర జీవితాన
ఈ మధుర భావగాన
మేలోకవాసి యూర్పు
సించెనో ?
ఏ వేకువందు పిల్పు
పంచెనో ?

*

# నవ్యసాహిత్యం - ప్రణయము

గొడవర్తి సూర్యనారాయణరావు

భావకవిత్వం అనే పేరుతో వెలువడుతున్న నవ్యసాహిత్యం సారస్వతంలో బయలుదేరిన విప్లవమనీ, అది సాహితీవృక్షానికి వేరుపురుగనీ ప్రాచీనసంప్రదాయంవారు ఏవగించుకుంటున్నారు. అందుచేత ఇది కొంత దుర్విమర్శకు లక్ష్యమైంది. ఒకవిధంగా ఇది సాహిత్యంలో నిర్మించినటువంటి 'క్రౌర్యకౌటిల్యకల్పిత కఠినదాస్యశృంఖలాలను' ఛేదించిన స్వేచ్ఛాగానం. కొంచెం ఓపికపట్టి సహృదయతతో పర్యాలోచన చేస్తే ఇందులోకూడా పరిగ్రహణయోగ్యం అయినవిషయం ఉన్నదని నివేదిస్తూ దీన్నికూడా ఆదరించాలని గుణగ్రహణ పారీణులను ప్రార్థించటం ఈవ్యాసంయొక్క ముఖ్యోద్దేశం. పాంచభౌతికమైన ప్రపంచంలోమాదిరిగానే కావ్యప్రపంచంలోకూడా మంచిచెడ్డలు మిళితమై ఉండకతీరదు. ద్వంద్వాల కతీతమైంది స్వర్గంగాని మానవప్రపంచం కాదు.

ఇక నవ్యసారస్వతంలో ఏకదేశంగా ప్రణయాన్ని గురించి ప్రసంగిస్తాను. కళా, ప్రకృతీ కూడా ఎప్పుడూ పరస్పరం ఆధారపడి ఉంటయి. ( **Art and Nature are interdependent**) ముక్తిగర్భితమైన సారస్వతానికి ప్రశాంత వాతావరణాన్ని ప్రకృతి ప్రసాదిస్తుంది. భావబంధురహృదయుడైన కవికుమారుడు ప్రకృతిలోని మధురరసాస్వాదనంచేత ఆనందమయుడై, ప్రకృతిలోనున్న వస్తుతత్వాన్నే గ్రహించి, అనన్యసాదృశ్యమైన తనకల్పనాశక్తీ, కావ్యశిల్పమూ వినియోగించి, కథావస్తువు అల్లి కావ్యానికి రససిద్ధిని గూరుస్తాడు. ఈవిధంగా ప్రకృతిని కళ అనుసరించింది. ప్రకృతిలోని పురుషుడు కావ్యసృష్టిని జూచి ఆనందం పొంది అందులో ప్రతిఫలించిన జీవనాన్ని ఆచరణలో పెట్టటానికి ప్రయత్నిస్తాడు. అనగా అందులోని స్త్రీపురుషపాత్రలమోస్తరుగా జీవనయాత్ర నడపటానికి ప్రయత్నిస్తుంది మానవలోకం. కళను ప్రకృతి అనుసరించటం అంటే ఇదే. అందువల్లనే మన ప్రాచీనులు తమ కావ్యాల్లో నాయికానాయకపరిగ్రహణంలో అంత జాగ్రత వహించారు. వాళ్ళల్లో ఉదాత్తతే లేకపోతే వాళ్ళు ఆదర్శప్రాయులే కారు. వాళ్ళూ మనతో సమానమే. అప్పుడు కళకు పరమార్థతే **(idealism to art)** నశిస్తుంది.

సారస్వతంలో ప్రణయ ప్రబంధాలకూ, ప్రేమగీతాలకూ తావు ఎక్కడా అంటే ప్రాచీనాలంకారికు లందరూ ఏకగ్రీవంగా నవరసాల్లోనూ శృంగారం మాళి

భూతమని చెప్పి ప్రణయానికి అగ్రతాంబూలం ఇచ్చారు. ఎందువల్లనంటే సృష్టి కది హేతుభూత మైంది. శృంగారం అనగా ప్రేమ. అది వినా ప్రపంచం నాస్తి. చైతన్యపూరిత మైన క్రిమికీటకాదులు మొదలు ఉత్కృష్టజన్మ పొందిన మానవుడి వఱకూ ఈప్రేమ వ్యక్తమవుతూ ఉన్నది. ఇంతేకాదు.

ప్రహరి చరింపుచున్ దిగిచి పట్టుకు నొండొకటిన్ సతమ్ము నీ
గ్రహముల ప్రేమసూత్రముల రాగవశంవదవృత్తిగాదె దు
స్సహబహుళాధ్వయానముల శ్రాంతి యెఱుంగ కుడుల్ చరించు స
న్మహము వియోగభారవహమైన దయావహగీతికారుతిన్.

గ్రహతారకాదులు సైతం ప్రేమ సూత్రాలచేత బంధింపబడి ఉన్నవని తెలుస్తున్నది. ఇదిగాక,

సారభములేల ఝమ్మ పుష్పవ్రజంబు
చంద్రికల నేల వెదజల్లు చందమామ
ఏల సలిలంబు పారు గాడ్పేల విసరు-

అని చెప్పటలో ప్రేమ ప్రకృతిసిద్ధమని వ్యక్త మాతున్నది.

ప్రేమ అనేది అనూచానంగా వస్తున్నది గనక, శృంగారకావ్యాలు అత్యవసరము. ప్రపంచంలో నిత్యవ్యవహారంలో రౌద్రవీరభయానకాలకి గాని బీభత్సాద్భుతాలకుగాని, ప్రేమకు- లేక శృంగారానికి- ఉన్నంత ప్రాముఖ్యం లేదు. ఒకవేళ ఉన్నా ప్రేమకు అవసరమైనటువంటి ఉదాత్తత (nobility), మార్దవం (refinement), వాటికి అక్కర లేదు. పామరుడి శృంగారం కంటె నాగరకుడి శృంగారంలో కొంత మార్దవం ఉండక తప్పదు. మానవు డెప్పుడూ ఉదాత్తమైన దాన్ని కోరటం సహజం. అది మానవత్వంయొక్క లక్షణం. కాబట్టి కవులు శృంగారకావ్యాలు రచించి మానవుడికి ప్రేమలో ఉన్న సౌందర్యాన్ని చూపించాలి. శృంగారానికే ఎందుకు ప్రాధాన్యం ఇవ్వాలంటే ఇది సర్వప్రాణి సులభము. మీదు మిక్కిలి ఇచ్ఛితం. అన్నింటి కన్నా ఇంకో విశేషమేమిటంటే అఖండితం, అవిచలితం, అప్రతిద్వంద్వం అయినటువంటి నాయికా నాయకుల ప్రేమ జీవేశ్వరైక్యానికి ఛాయ. కవి మానవసంఘానికి ఆదర్శప్రాయుడూ, ధర్మమూర్తీ, శాసనకర్తా గనక స్వచ్ఛమైన ప్రేమగీతాలు రచించి మనం ఆప్రణయాన్ని ఆచరణలో పెట్టేటట్లు చేయటం ఆయన విధి. ఈప్రణయగీతాలు నేటివి కావు; ఇవి సృష్టితోనే ఆరంభించాయి.

ప్రేమ పెన్నిధి, గాని యింటను
నేర్ప రీకళ, ఒజ్జ లెవ్వరు
లేరు, శాస్త్రము లిందు గూరిచి
తాల్చె మౌనము, నేను నేర్చితి
భాగ్యవశమున కవులకృప గని.

ప్రాచీనకాలంనుంచీ శృంగార కావ్యాలు వెలువడుతూనే ఉన్నాయి. మన ప్రాచీనులు బాహ్యసృష్టిలోనుంచి ఒక రసమయాంశాన్ని గ్రహించి కావ్యసృష్టి చేశారు. అందుచేత వారిది పరాశ్రయకవిత్వమైంది. (Objective poetry). ఆధునికుల ప్రణయకవిత్వం ఆత్మాశ్రయరూపం (Subjective poetry) పొందింది. అంతే భేదం. ఈరూపపరిణామానికి కారణం ప్రక్రియావైవిధ్యం. ఇదిగాక ప్రాచీనకవిత సహృదయసంజనితమైన భావాలను కావ్యనాయకుడికి ముఖస్థంగా, పరోక్షంగా, వ్యక్తం చేశాడు. ఆధునికకవికుమారుడు తానై ప్రత్యక్షంగా స్వీయ భావాలను వ్యక్తంచేశాడు. రెండోమార్గమే రసానుభూతికి ఎక్కువ పోషకం. ఈ విధమే పాఠకుడి మనస్సుకు ఎక్కువ హత్తుతుంది ఎందుచేతనంటే కవి స్వచ్ఛందప్రణయాన్ని తాను రసవంతంగా నివేదిస్తాడు. రెండోవిధంగానే కవి మనకు సన్నిహితుడుగా ఉండి మన హృదయాన్ని ఆకర్షిస్తాడు. (He comes closer and makes a direct appeal.)

మన ప్రాచీనసంస్కృతకవులు ఉత్కృష్టమైన ప్రణయాన్ని సృష్టించి చూపారు. సీతారాముల ప్రణయాన్ని నిరవధికంగా, మనోహరంగా ఉత్తరరామ చరిత్రలో భవభూతి ప్రసాదించాడు. అలాగే శకుంతలాదుష్యంతుల ప్రేమను గూడా వ్యక్తంచేశాడు కాళిదాసు.

కాని మన తెనుగుప్రబంధకవులహస్తాల్లో పడి ప్రేమపుష్పం నలిగి సౌరభాన్ని కోలుపోయింది. మన ప్రబంధకవులు నాయికానాయకుల ప్రణయాన్ని, శృంగారాన్ని కూడా భౌతికంగా చూశారు. అంగసౌష్ఠవానికీ, రూపలావణ్యానికీ ప్రాధాన్యం ఇచ్చారు. స్త్రీ భోగవస్తువుగా కామం అంటే కేవలం రతి ప్రధానంగా చూస్తూ శృంగారరసానికి స్థాయి రతి అన్నలక్షణానికి లక్ష్యం చూపించారు. కాని దశరూపకకర్త సంయోగశృంగారానికి ఉత్తరరామచరితనుంచి–

వినిశ్చేతుం శక్యో న సుఖ మితివా దుఃఖ మితివా
ప్రమోహో నిద్రావా కిము విషవిసర్పః కిము మదః
తవ స్పర్శే స్పర్శే మమహి పరిమూఢేంద్రియగణో
వికార శ్చైతన్యం భ్రమయతి సమున్మీలయతిచ

అని ఉదాహరణాన్ని ఇవ్వటాన్నిబట్టి శృంగారరసానికి స్థాయి అయిన రతి కేవల సంభోగేచ్ఛ కాదనీ దానికంటె అతీతమైన దనీ తేలుతున్నది. సంయోగాన్నిగూర్చి ఆంధ్రకవితాపితామహుడు-

సహసానఖంపచస్తనదత్తపరిరంభ
　మామూలపరిచుంబితాధరోష్ఠ
మతిశయప్రేమకల్పితదంతసంబాధ
　మగణితగ్లానిశయ్యానిపాత

మని తనకూర్పునేర్పుతో నిగూఢంగా వర్ణించాడు. దీనికి తేటతెనుగు వ్రాస్తే వాత్స్యాయనుడి కామసూత్రాలకీ దీనికీ భేదం లేదని తెలుస్తుంది. ఈమన్మథ క్రీడని వర్ణించటంలో దాంపత్యంలో ఉన్నపవిత్రతకు బదులు మోటుచేష్ట బహిర్గత మైంది. సంభోగక్రియలో మానవుడికీ పశువుకీ భేదం ఉండదు. ప్రేమలో ఈపశుత్వాన్నే మానవుడు కాంక్షించేటట్లయితే వాడు మానవత్వంనుంచి ఒక మెట్టు కిందికి దిగుతున్నాడు. సంయోగశృంగారంలో పై రతివర్ణనకంటె

మేలేర్చి సందుండు పూలు గోసి యొసంగ
　సరము లందముగ సుందరి రచించు ;
మెలత వర్ణమ్ములు మేళవించి యిడంగ
　హరువుమై నతడు చిత్తరువు వ్రాయు ;
బతి యపురూపభావము వచించిన నను
　రూపపద్యమునఁ గూర్చును లతాంగి ;
అతివ చక్కనిరాగ మాలపించిన వీణ
　పలికించు నతడు మై పులకరింప ;

అన్న దంపతుల వినోదవిహార క్రీడల్లో వాళ్ళ ప్రేమ సున్నితంగా చక్కగా వ్యవహృతం అవుతుంది. ఇక అయోగంగాని వియోగంగాని ప్రబంధకవులు

మోహాపదేశతమోముద్రితము లైన
　కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందుతారకాగమఖిన్నకుచకోశ
　ముల జంద్రనామంబు దలపరాదు
శీర్యదాశావృంతశిథిలితాసులతాంత
　మసియాడ వీవనల్ విసరరాదు
పటుతాపపుటపాకపరిహీణతను హేమ
　మింక బల్లవపుటా ర్చిడగరాదు.

అని వర్ణించారు. వీరి నాయికానాయకులకు అయోగసంయోగవియోగాలు, పుష్ప లతికాక్రీడా, నికుంజాల్లో ముద్దులు, గిల్గింతలు, హిమసలిలచంద్రచందనమృణాళ కదళీదళాదిసేవనము, చంద్రమన్మథమలయానిల ఉపాలంభనాలు, దూతీప్రేష ణాలు తప్పని బలవంతపు బ్రాహ్మణార్థాలు. నవరసాలకు మకుటప్రాయమైన శృంగారాన్ని సర్వలక్షణయుక్తంగా కావ్యంలో దింపారు. అయోగసంయోగ వియోగాల్లో అయోగవియోగాలే ఉత్కృష్టమైనవి. అయోగంలోకాని వియో గంలోగాని ఉన్నట్టిప్రేమ సంయోగంలో లేదు. ప్రేమవాహినికి సంయోగం ఒకచెలియలికట్టలాంటిది. ఎందువల్లనంటే సంయోగంలో కోరిక సిద్ధిస్తుంది. ఒకవస్తువును పొందేదాకా దానికై పరితపించటంలో, ఆదుర్దాపడటంలో ఉన్న తమాషా ఆవస్తువును పొందటంతోటే పోతుంది. ఆవస్తువును పొందటానికి ముందు మనం ఆశాసౌధాలు కట్టుకుంటాం, దాన్ని పరిపరివిధాల భావిస్తాం. వస్తువు లభించిన తరువాత అట్టిభావనకు తావు లేదు. అందుచేత శృంగారంలో సంయోగంకంటే అయోగవియోగాలే ఎక్కువరసవంతాలు. అందుకనే మనకు శృంగారంకంటే విప్రలంభశృంగారం అంటే ప్రీతి. పూర్వకులైన సంస్కృతకవు లూ, మాధ్యమికులైన ప్రబంధకవులూ, నేటి నవీనకవులూకూడా ఈ వియో గాన్ని, విప్రలంభశృంగారాన్ని, వ్యక్తంచేశారు. ఆదర్శం ఒక్కటైనా వీరి దృష్టిలో భేదం కలిగింది.

ప్రేమ బహుముఖం. మాతృప్రేమ, భాతృప్రేమ, పుత్రప్రేమ, దాంపత్యప్రేమ, భృత్యప్రేమ – మొదలుగా గలవి. కాని ప్రస్తుతం దాంపత్యప్రేమ అయిన శృంగారాన్ని గ్రహింతాము. ప్రేమ ఒకపవిత్రమైన భావము. దాన్ని ఊహిం చినకొద్దీ, భావించినకొద్దీ అందులోని నైర్మల్యము వ్యక్తమవుతూ ఉంటుంది. ప్రాచీనులు ఈప్రణయాన్ని భావించి దానియొక్క అనంతత్వాన్ని గ్రహించారు. కాని ప్రబంధకవులు శృంగారాన్ని కేవలం భౌతికదృష్టితో చూడటంతోటే తృప్తిపడ్డారు. శృంగారానికి అవధి కేవలం పశుతుల్యమైన భౌతికశృంగారం **(Physical lust)** కాదు. అట్లాగే అయితే అది అఖిలజంతుసామాన్యమైన శరీరసౌఖ్యలోలత అవుతుంది. పరువముతోపాటు శృంగారం పోతుంది. ఇది కేవలం సంకుచితదృష్టి. విషయవాంఛ లేనప్పటికీ వృద్ధదాంపత్యంలో ఎంత హాయిగా ప్రేమ అనుభూతి అవుతున్నదీ అనుభవైకవేద్యం. ఈవాసనాపరంప రలు తొలిగితమైతేనే ఈప్రణయానికి స్వచ్ఛత- పవిత్రత ఏర్పడుతుంది. మానవుడు ఎప్పుడు రూపలౌల్యంకంటె హృదయం పవిత్రమైనదనీ, సంగమకార్యంకన్నా ప్రేమభావ ముత్కృష్టమైనదనీ గ్రహిస్తాడో అప్పుడే అతనిలోని మానవత్వం బహిర్గత మౌతుంది. ఇట్టి ప్రేమకీ విషయోపస్కారమైనశృంగారానికీ హస్తిమశ

కాంతరం ఉన్నది. అవికలం, అద్వితీయం అయినప్రణయతత్త్వాన్ని గ్రహించాలి. అది బ్రహ్మజిజ్ఞాసకు మెట్టు. " కామోత్కంఠత గోపికల్ " అని చెప్పటంలో ఈప్రణయరూపకంగాకూడా ఈశ్వరసాయుజ్యం లబ్బుతుందని చెప్పాడు పోతన్నగారు.

ఇట్టి పవిత్రమైనప్రేమకే, ప్రణయానికే, నవ్యసాహిత్యోపాసకులు అట్టులెత్తి చూస్తున్నారు, ఆశిస్తున్నారు. ప్రణయంయొక్క గాంభీర్యం, ఔన్నత్యం నిశితత్వం, అంతస్సారం, అంతశ్శక్తీ పూర్వులు ఎంతగా ఆశించి భావించారో నవ్యులున్నూ అట్లే చూస్తున్నారు. వీరికి భౌతికశరీరంతో అగత్యం లేదు. వీరికి ప్రేమ జీవితలక్ష్యం.

వసివాళ్వాడ దొరకప్పుడు
గసుగందదు మేల్మిచాయ కస్గదు తావుల్
కొసరు మరందము చిలుకును
విసువక యెద దాల్తు నట్టిప్రేమసుమమ్ముక్.

ఇది వీరిప్రేమయొక్క ఛాయ. ఇంతే కాదు.

ఎద మెత్తనౌటకై
సొదగుందరా అంత
మది గల అహమ్మెల్ల
వదలి పోవునురా
వల పెరుంగక బ్రతికి
కులికి ముదిసేకంటె
వలచి విఫల మ్మైంది
విలపింప మేలురా !
చెలి వలపులేని నీ
కలిమి కాల్పనె వినుము

వలపుతీగనె జీవ
ఫలము కాయునురా.
ప్రేమకంటె ఎక్కు
వేముందిరా ఎల్ల
కామ్యపదవులకన్న
ప్రేమ ఎక్కువరా.
ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
ఏ మింక వలెనురా !

**Better to have loved and lost than to have never loved at all.**
ఈప్రేమ హృదయంలో కర్కశత్వం పోగొట్టి మృదుత్వాన్ని ఆపాదిస్తుంది. ఈ మార్దవం అయోగంవల్ల ఎక్కువగా కలుగుతుంది. ప్రేమ అనేది ఎల్లాంటిదో ఎరుగనివాడి కున్నంత రాతిగుండె ప్రేమించి అయోగంలో ఉన్నవాడి కుండదు. కష్టా లనుభవించినవాడు పరులదుఃఖాన్ని చూచి జాలిపడ్డట్టుగా కష్టా లనుభవించనివాడు జాలిపొందడు. కనుక అయోగవియోగాల్లోనే హృదయంలో ఒకవిధ

మైనటువంటి refinement వస్తుంది. ప్రేమకంటె ప్రపంచంలో కోరతగినటువంటిది ఇంకొకటి లేదు. ప్రేమలోకూడా మూడంతస్థులు. ఒకటి భౌతికసుఖం. రెండవది మోక్షాసక్తితోకూడిన ప్రేమ. మూడోది నిష్కామకర్మగా ప్రేమించటం. **Love for the sake of happiness; Love as a medium for the realisation of the absolute Bliss; Lastly, Love for love's sake**. ఇదీ వీరియొక్క ప్రేమసిద్ధాంతం.

ఈ ఆత్మాశ్రయమైన ప్రణయగీతములు వ్రాయుట అసిధారావ్రతంవంటిది. ఇందులో ఔచితి చాలా జాగ్రతగా కాపాడాలి; లేకపోతే ప్రపంచానికి అమంగళకర మౌతుంది. కవి తన ప్రణయగీతికి విశ్వప్రయత్నము universalisation సాధించి చిరస్థాయిత్వము చేకూర్చలేకపోతే అతని ప్రణయాన్ని చూచి ఎవడూ ఆనందించడు. ఈవిషయంలో కవికి అంతశ్శుద్ధి (sincerity) చాలా ముఖ్యం. అట్లా కాకపోతే

> 'కవిసమయంబు దప్పి నుడికారపుసొంపును పాడుచేసి నీ
> వెవతుకకోసమో కుమిలి యేడ్చుచు చక్కని తెల్గుకైత కా
> యువులు గుదించి యేమిటి కయోమయముం బొనరింతువోయి నీ
> కవనము పాడుగాను చెడుగా! యికనేనియు రమ్ము దారికిన్.'

అన్న నింద కాస్పదుడు కాకతప్పదు. పరకీయశృంగారాన్నిగాని, భౌతికశృంగారాన్నిగాని గూర్చి రచించిన పద్యాలు ఎక్కడైనా ఉంటే అవి అవశ్యం త్యాజ్యాలు అని నిర్మోహమాటంగా చెప్పవచ్చు. తుచ్ఛమూ, నశ్వరమూ అయిన సౌందర్యలాలసకూ పవిత్రప్రణయానికీ పోలిక లేదు.

ఈస్వచ్ఛప్రణయాన్నే ఆధునికులు అంతకంతకు ఉత్కృష్టభావంతో చూస్తున్నారు. వీరికి స్త్రీ, రూపందాల్చిన ప్రణయం (**Impersonation of love**). వీరు కేవలం గృహాంగణంలో నాలుగు గోడల మధ్యనూ ఉన్న స్త్రీని వెలువరించి ఒకవిశాల ప్రపంచంలో ఉంచి ఒకవిశాలదృష్టితో చూస్తున్నారు. స్త్రీ భార్య, మాత, భగిని, అనేటువంటిభావాన్ని త్యజించి ఒకమూర్తిగా ఆరాధిస్తున్నారు. తొలుత హృదయేశ్వరిగా, తదుపరి క్రమేణా ప్రేయసిగా, సఖిగా, దేవిగా, ఈశ్వరిగా ప్రేమిస్తున్నారు. స్త్రీని హృదయేశ్వరిదృష్టితో చూడటం మానవసహజం. ప్రేయసిగా (**unique love**) సఖిగా (**unique companion**) చూడటం విశాలభావాన్ని, హృదయనైర్మల్యాన్ని, సూచిస్తయి. దేవిగా, ఈశ్వరిగా చూడటం (**Goddess or divine mother**) చూట్టం భక్తినమ్రతలనూ తన అల్పత్వాన్నీ గ్రహించిన చిత్తసంస్కారాన్ని సూచిస్తయి. మానవుడికి విషయోపరాగరహితమైన విజ్ఞానం కల్గినప్పుడే స్త్రీ దేవీరూపం తాలుస్తుంది.

ఉదయసంధ్యా నవాంశువు లదుమ దద్ద
రిల్లి ఆశాంతములనుండి మెల్లమెల్ల
కుంచుకొనిపోవు నీ నీడ కొనల వెంట
చేరుకొందును నీపదాంభోరుహములు.

ప్రబలమధ్యాహ్న తీక్ష్ణాతపమున కలగి
అలసిపోయిన నీనీడ కలసిపోయి
ప్రణయభావాతిమధుర విశ్రాంతికొఱకు
నీశరీరాంచలము లంటి నిలిచియుందు.

అపరసంధ్యార్ద్రరోచుల నమృతరాగ
మంజురంజితమై సాగి మరల దెసలు
క్రమ్ముకొనిపోవు నీనీడ కలసి వెడలి
ఆ యనంతదిగంతమ్ము లావరింతు.

కవి ఇచ్చట దాంపత్యప్రేమను ఒక దినంతో పోల్చాడు. సూర్యోదయం మొదలు మధ్యాహ్నం వఱకు నీడలు క్రమేణా తగ్గి వస్తువులో ఐక్యమై సాయంకాలానికి క్రమేణా విస్తరించి నలుదిక్కులా వ్యాపిస్తయి. అల్లాగే పురుషుడుకూడా స్త్రీ హృదయంతో తన హృదయాన్ని ఐక్యం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. జీవితంలో మధ్యాహ్నకాలానికి హృదయేశ్వరితో ఐక్యం కాగలిగినాడు (became one with her). తరువాతకాలం చెల్లి ప్రాయపుప్రొద్దు వాలుతుండగా తన స్వచ్ఛమైన ప్రణయాన్ని దశదిశలా వ్యాపింపజేసి తుదకు అనంతమైనటువంటి సృష్టిప్రేమతో (universal love) ముడి పెడుతున్నా డన్న భావం పైని వ్యక్త మవుతున్నది.

అంత శ్రమపడి పావన మభ్రగంగ
ధారుణికి తెచ్చినాడు భగీరథుండు
అంత మథియించి కలశరత్నాకరమ్ము
అమృతభాండమ్ము పడసినా రమరవరులు.

మత్పురానేకపుణ్యజన్మములు పండి
జాహ్నవీస్వచ్ఛవును సుధాస్వాదుమూర్తి
వైన నీదివ్యసాన్నిధ్య మందుకొంటి
పుడమికే స్వర్గమున కొక్కముడి రచించి.

ఇంతకాలమ్మగా నా కదృష్టము లయి
ఎన్ని యానందధామము లేయనంత
భువనసంధుల భాసిల్లు నవియు నేడు
మత్పదాక్రాంతములు భవన్మహిమ జేసి.

వారికాంక్షలు ఫలించటానికి భగీరథుడు, అమరులు, బ్రహ్మ ప్రయత్నం చేశారు. కాని అతడు ప్రాక్తనపుణ్యశాలి కాబట్టి అమృతమూర్తి జాహ్నవీస్వచ్ఛ అయిన హృదయేశ్వరిసాన్నిధ్యం సునాయాసంగా లభించింది. ఇక అతను కాంక్షించేది లేదు. ఆనందధామాలు అతనికి పాదాక్రాంతా లన్నాడు.

ఆమె నవనీతహృదయ, నాయంతరంగ
శాంతిదేవత, ఆశాపథాంతరాళ
పారిజాతమ్ము, ప్రేమజీవనవిభాత
కైశికీగీతి, నాతపఃకల్పవల్లి.

ఆమె జగదీశమకుటాగ్రసీమనుండి
యుర్విపై జేరిన సుధామయూఖరేఖ.
ఆమె మూడులోకాల కళ్యాణమునకు
అవతరించిన యొక పవిత్రానుభావ ;
మామె నాజన్మజన్మపుణ్యములు పండి
ప్రాప్తమైన కేళీపరిత్యాగలీల ;
ఆమె పదసన్నిధాన దివ్యస్థలాన
భక్తినమ్రుడనై నిలంబడినయపుడు
తలపునకు వచ్చునా పేదతనము నాకు ?

* * *

ఆమె పదసన్నిధాన దివ్యస్థలాన,
నాకకల్లోలినీపదన్యాసమునకు
దరవినతమైన హరజటాభరమువోలె
నతుడనయ్యు, మహోమహోన్నతి వహింతు.

ఇక్కడ స్త్రీని ప్రణయదేవతగా, ఇష్టదైవముగా ఆరాధిస్తున్నాడు. ఈపంక్తుల్లో ప్రణయంలో ఎంత దృష్టివైశాల్యం, ఎంత పవిత్రత ఉన్నవో గమనించండి. హృదయేశ్వరీప్రణయంకంటె ఇక్కడ ప్రేమ ఇంకొకమెట్టు పై కెళ్లింది. పైగీతం లోని విశేషణాలే ఆమెయందు తనకుగల పవిత్రభావాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

వత్సలాఫాలమున నెలవంకగుఱుతు
కందళించి వికాసించి కళలు దేఱి,
తరుణశారదరాకాసుధాకరాచ్ఛ
బింబము లనంతములు లెక్కపెట్టుకొనెడు.

ఈయమర్త్యాచ్ఛచంద్రిక లెన్నినాళ్ళ
నాతనువు ముంచుకొను నన్నినాళ్ళ ఒక్క
యీశరత్తేమి నాది సదా శివత్వపదవి.

ఆమె యీశ్వరిగా తాను ఈశ్వరుడుగా- అనగా అర్థనారీశ్వరుడిగా భావిస్తున్నాడు. ఇదే మానవుడు పొందదగిన ఉత్కృష్టమైనటువంటిస్థానం. మానవుడు తనలో ఉన్న శివతత్వాన్ని గుర్తించటమే ఆతని జీవిత పరమాదర్శం. శ్రీనాధుడు,

ఆనందంబున అర్ధరాత్రముల చంద్రాలోకముల్ గాయగా
నానాసైకతవేదికాస్థలములన్ నల్దిక్కులన్ శంభు కా
శినాథున్ తరుణేందుశేఖరు శివున్ శ్రీకంఠునిన్ బాడుచున్
మేనెల్లం బులకాంకురప్రకరముల్ నిండార మిన్నేటిలోన్.

అని చెప్పి, ఈశ్వరసాన్నిధ్యం, బ్రహ్మానందం ఒక్కక్షణకాలం పొందగలిగితే ఈతడు బ్రహ్మానందం నిత్యం పొందుతా నన్నాడు. తన ఆనందం సార్వకాలికం అన్నాడు- "ఈశరత్తేమి నాది సదాశివత్వ పదవి."

భాద్రపద మట విమలాభ్రపథము గ్రమ్మ
నీవినీలాంబుదోద్గత విన్మయఖండ
వర్షధారాప్రవాహమ్ము వచ్చి వచ్చి
నా హృదయగోళమునయందు నదులుగట్టు.

జీర్ణవసనుండ నీచలి చించుకొనెడు
నాకృశీభూత దేహమ్ముపైకి పొర్లు
నీప్రవాహవేగము నిల్వనీదు నన్ను.

ప్రళయసూచన యేమొ నా ప్రణయమునకు
అంతకంతకు దుర్వారమై ధరిత్రి
యింతయును ముంచుకొనునటే యీయకాండ
విలయ జలరాశి నా నిరుపేద జీవ
కళిక తనలోన నొక యశ్రుకణము జేసి

ఆమహోగ్రకూరజలరాశియం దనంత
భంగము లుదగ్రగతుల నుప్పొంగు ననుము.
అచట నాప్రేమయను మణిద్వీపాకు పఱచి
నేను పవళించెదను సుధానిభ్రుతమూర్తి.

ఈస్వచ్ఛప్రణయానికి ఉగాదులతోను ఉషస్సులతోను సంబంధం లేదు. దాని కతీతమైంది. ఈశ్వరునివలెనే అది అనంతం, అవిచలితం (Love is eternal). ప్రళయం దాన్ని నశింపజేయలేదు. ఈస్వచ్ఛమైన ప్రేమకు కష్టాలను జయించ టమే కాకుండా మృత్యువునుగూడా జయించేటువంటి మహత్తరమైనశక్తి ఉన్న దనటానికి సావిత్రీ సత్యవంతులు నిర్వికల్పమైన సాక్షులు. ప్రణయాని కున్న ఈశక్తినంతా నవ్యకవికుమారుడు గ్రహించాడు.

స్త్రీలోకంలోగూడా కొంత సంచలనం కలిగింది. కొందరు సౌదామిని మొదలుగా ప్రచ్ఛన్న నామాలతో ప్రణయగానం చేయటం ఆరంభించారు. స్త్రీ హృదయాన్ని వ్యక్తీకరించటానికి మనపురుషులు ప్రయత్నించినా స్త్రీహృద యం వ్యక్తం చేయటం స్త్రీకి సులభం. వారిగీతాల్లోనే స్త్రీహృదయం పూర్తిగా పరిస్ఫుటం అవుతుంది. వారి రచనలకు సుస్వాగతం.

ఇప్పుడు నేను నివేదించుకొనే దేమంటే నవ్యసాహిత్యంలో గ్రహించవలసినది యోగ్యమైంది కొంత ఉన్నదనీ దాన్ని, ఆదరించాలనీ, విచారణ చేయకుండా తప్పుడుతీర్పులు చేయవద్దనీ. ఈస్వచ్ఛందప్రణయగాయకులగానం శ్రవణ పేయంగా విని ఆనందించండి లేకపోతే

"వలపు తీపియెరుంగని వట్టి రాతి
గుండె లోకమ్ము నిప్పులు గురియనిమ్ము."

అని తిరస్కరింపబడి సరసులుగా కాక విరసులుగా పరిగణింపబడతారు.

*

# పిచ్చా!

కొడాలి ఆంజనేయులు

గణ గణ మోగే
గంటల చప్పుడు
మిథ్యా దైవము
మేలు కొల్పునా!

విప్రులు చదివే
వేదపు పనసలు
రాతి బొమ్మలను
రంజిస్తయ్యా!

భక్తులు చేసే
భజనల మోతకు
శిల కాకుంటే
చెవుడు పుట్టదా!

అతని పేరుతో
అయ్యే హత్యల
కసలతడుంటే
హడిలి పోవడా!

మతమూ పిచ్చుతో
మానవ లోకం
మురుగెత్తించే
మొద్దా దైవం?

*

# దేవుడు లేడా నవ్యకవీ

చింతా దీక్షితులు

వెలిగే దీపం ఆర్పెయ్యకురా,
దేవుడు లేడని తిట్టబోకురా ;
తల్లో మెదడూ చేతికి కండా
నిండా వుంటే మిసాల్ దువ్వడ
మెందుకురా ? మరి దేవుడు లేడని
బీరా లెందుకు నవ్యకవీ ?

బతికిన వాడిని తిడితే భయమా !
దొరలను తిడితే జైలుందా !
తురకను తిడితే తంతాడా ! – సరి –
తన్నని వాడూ తిట్టనివాడూ
ఒక్క దేవుడే అని ధైర్యంరా ?
అందుకు దేవుని తిడతావా ?

నాగలి పట్టుకు దున్నగలవురా ?
రాటం పెట్టుకు వడకగలవురా ?
సుత్తెను ఎత్తి కొట్టగలవురా ?
వాడిత విసిరి చెక్కగలవురా ?
కాళ్లు చాపుకొని కూచుంటావా !
దేవుడు నోటికి అందియ్యాలా !
కడి మెడు అన్నం ఒంటికి బట్టా
బీదలకంటూ పెట్టగలవురా ?
దేవు ణ్ణెందుకు తిడతావు ?

పట పట పళ్లను కొరకడ మెందుకు ?
పద్యాల్లో బీభత్సా లెందుకు ?
దేవుడుగుళ్లను కూల్చాలంటూ
పద పద మంటూ పరుగులు ఎందుకు ?
శ్రీమద్భగవద్గీతావాక్యాల్
విషతుల్యములని ఏడుపు లెందుకు ?
దేవుడు లేడని తిట్టడ మెందుకు ?

పిల్లిశాపముల కుట్లు తెగేనా,
కవిగీతాలకు కడుపు నిండునా,
కాళ్లనొప్పులూ కంఠశోషలూ
ఏమిటిలాభం నవ్యకవీ ?

హెజ్జీవెల్సూ అనటోల్ ఫ్రాంసూ,
మాక్సింగోర్కీ, బెర్ట్రామ్ రస్సెల్
బెర్నాడ్‌షాలా గురువులు నీకు ?
ఆదిశంకరులు విద్యారణ్యులు
భాష్యకారులూ మధ్వాచార్యులు
రామకృష్ణులూ మహర్షులంతా
ఏమైనారుర నవ్యకవీ ?
దేవుడు లేడా నవ్యకవీ

బీదలసాదల కడుపు చిచ్చులకు
కవి గీతాలా అన్నపు కరుళ్లు ?

వ్యాసుడు పుట్టిన దివ్యభూమిలో
దేవుడు లేడను మాట పుట్టెనా ?
కృష్ణుడు రాసక్రీడలు సల్పిన
దేశములోనే దేవుడు లేడట !
శివతాండవ సుక్షేత్రములోనా
దేవునిపై అపనిందలు పలుకుట ?
రామమోహనుడు రామకృష్ణుడూ
మొన్న మొన్ననే వాసంచేసిన
పుణ్యభూమిలో దేవుడు లేడని
పుట్టిందా ఈ దారుణవాక్యము !
మహర్షు లింతో అంతో యింకా
దేశంలోపల తిరుగు తుండగా
దేవుడు లేడా నవ్యకవీ ?

# నాయకుడెందుకు

భారతుల పున్నయ్యశాస్త్రి

విద్యానాథుడు 'ప్రతాపరుద్రీయం' అనే పేరుతో కావ్యస్వరూపాన్ని నిరూపించే అలంకారశాస్త్రగ్రంథాన్ని వ్రాయబోతూ, ఇదివరలో కావ్యస్వరూపాన్ని నిరూపించే గ్రంథాలు అనేకులు వ్రాసివుండగా మళ్ళా తను వ్రాయడం అనవసరం అనిపించుకోకుండా వుండగలందుకు, లోగడ వ్రాసిన వారి గ్రంథాలకు తగిన నాయకుడు లేడనే అపకర్ష ఒకటి వున్నదనీ, తన కిప్పుడు సర్వగుణోత్కృష్టుడైన ప్రతాపరుద్ర చక్రవర్తి కృతిపతిగా దొరికాడు కాబట్టి, ఇప్పుడు తాను అతనికి అంకితంచేస్తూ వ్రాస్తే అలంకారశాస్త్రానికి పూర్వం వున్న (సరైన నాయకుడు లేడనే) అపకర్ష పోయి ఉత్కర్ష సిద్ధిస్తుందనీ, తద్ద్వారా కవికీ గ్రంథానికీగూడా గొప్ప ఉత్కర్ష అనీ చెప్పి దృష్టాంతంగా ఈక్రింది విధంగా వ్రాశాడు.

ఏవిధంగానైతే శ్రీరామచంద్రులవారి గుణాలు వర్ణించడంవల్ల రామాయణానికీ వాల్మీకికీ లోకంలో గొప్ప ప్రతిష్ఠ గలిగిందో, అదేవిధంగా మహాపురుషులను వర్ణించడంవల్ల ప్రబంధాలకుగూడా మంచి శ్రేయస్కరమైనస్థితి ఏర్పడుతుంది. ఏవిధంగానైతే వేదశాస్త్రపురాణాదులవల్ల హితప్రాప్తీ, అహితనివృత్తీ కలుగుతున్నవో, అదేవిధంగా సత్పురుషుడు నాయకుడుగా వున్న కావ్యంవల్లగూడా కలుగుతవి. ఆకలగడంలోకూడా ఒకవిశేషం వుంది. కావ్యాలవల్ల సరసంగా కర్తవ్యతాబుద్ధి ఏర్పడుతుంది. మిగతావాట్లల్లో అట్లా గాదు. చూడండి: వేదాలు ప్రభుసమ్మితాలూ శబ్దప్రధానాలూ అవడంవల్ల చిరకాలం శ్రద్ధనహించి చదివితేనే తప్ప కర్తవ్యతాబుద్ధి ఏర్పడదు. ఇంక పురాణాలు అర్థప్రవణాలూ సుహృత్సమ్మితాలూ అవడంవల్ల, ఎంతోసేపు అవధానం వుంచి వింటేనేగాని కర్తవ్యతాబుద్ధి ఏర్పడదు. కావ్యాలవల్ల అట్లా గాకుండా కాంతాసమ్మితాలు అవడంవల్ల ప్రియురాలు చెప్పినట్లుగా కర్తవ్యతాబుద్ధి సరసంగా హాయిగా ఏర్పడుతుంది. కాబట్టి మనకు సరసంగా బోధించే కావ్యాలంటేనే ఇష్టం.

దీన్నిబట్టి చూస్తే దృష్టంగానూ, అదృష్టంగానూగూడా కావ్యం మనకు బహుధా ఉపయోగిస్తుంది అని తేలింది. 'కావ్యప్రకాశము' అనేగ్రంథంలో ఈవిధంగా చెప్పివున్నది:– "కావ్యం కీర్తి నిస్తుంది; ధనాన్ని చేకూరుస్తుంది; వ్యవహారజ్ఞానం కలిగిస్తుంది; చెడుగును పోగొట్టుతుంది; వెంటనే,– అంటే చదవంగానే అన్నమాట – ఆనందాన్ని ఇస్తుంది; కాంతమాదిరిగా ఉపదేశం చేయడానికి

కూడా అర్థమవుతుంది." గొప్పగొప్ప ప్రబంధాల్లోగూడా ఈవిషయం ప్రసిద్ధంగానే వున్నది. చూడండి: "కావ్యంవల్ల విజ్ఞానం వృద్ధిపొందుతుంది; కీర్తి సంభవిస్తుంది; గుణాలు వ్యాపిస్తవి; మంచిపురుషులచరిత్ర వినబడుతుంది; ఇంత ఎందుకు? కావ్యంవల్ల హరించిపోనిచెడుగు ఏమున్నదో చెప్పండి?" అంతే గాకుండా, ఏగ్రంథలోనైతే ఉత్తమపురుషులచరిత్ర వ్రాయబడదో దాన్ని సుతరామూ పరిత్యజించవలసిందే. ఈసంగతి చెప్పడానికి 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అని స్మృతిగూడా వున్నది. అంటే సత్పురుషులచరిత్ర వ్రాయబడని గ్రంథాన్ని వదలివెయ్యవలసిందే – అంటే చదవగూడదన్నమాట. అయితే ఈపద్ధతి కేవలం కావ్యాలకే కాదు. శాస్త్రాలకుకూడా మహాపురుషాశ్రయత్వంవల్లనే గొప్ప లోకాదరం ఏర్పడుతున్నది. ఈశ్వరుణ్ణి ప్రతిష్ఠించినవి కనుకనే వైశేషికాదిశాస్త్రాలకు జగత్పూజ్యత సిద్ధించింది. అదే విధంగా మహాభారతం మొదలైనవాటికి మహాపురుషులను వర్ణించడంచేతనే విశ్వాతిశాయిత్వం అబ్బింది. ఊరికే చెప్పకపోతే ఏం ప్రయోజనం? వేదాంతశాస్త్రంవంటిదానిక్కూడా బ్రహ్మను ప్రతిపాదించడంచేతనే గొప్ప ఉత్కర్ష వచ్చింది. ఇంత ఎందుకు? 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అంటూ ఉపక్రమించిన సూత్రకృత్తైనమహర్షిగూడా పురుషాశ్రయమైన ధర్మగుణజిజ్ఞాస అంటూ మొదలుపెట్టి, నోటితో అనకుండానే 'మహాపురుషగుణవర్ణనమే శాస్త్రానికి ప్రాణం' అని అంగీకరించినవాడైనాడు. గ్రంథం తనకు ప్రమేయం అయినవిషయాన్ని చెప్పకుంటూపోయినప్పటికీ, మహాపురుషుల గుణాలను వర్ణించడం అనేది బంగారానికి పరిమళం అబ్బినట్లు శ్రేష్ఠత్వాన్ని చేకూరుస్తుంది.

ఈవిషయాన్నే దండిగూడా 'ఆదిరాజులకీర్తిబింబం వాఙ్మయం అనే అద్దంలో ప్రతిఫలించి వారు దగ్గిరలేకపోయినా నశించిపోకుండా స్వతహాగా వున్నది చూడండి' అన్నాడు. ఇట్లా అనడంవల్ల నాయకుడి మహత్తువల్ల ప్రబంధానికిగూడా మహత్వం వస్తుంది, అని చెప్పినట్లే అయింది. ప్రాచీనుడైన భామహుడుగూడా 'ఉపశ్లోక్యనిమాహాత్మ్యంవల్ల కావ్యసంపదలకు ఉజ్జ్వలత్వం కలుగుతుంది' అన్నాడు. ఉద్భటుడుగూడా ప్రతిపాదించాడు: గుణాలంకారచారుత్వం ఉన్నా కావ్యం ఆశ్రయసంపత్తివల్ల మేరుపర్వతంవల్ల దేవతావృక్షం ప్రకాశించినట్లు అధికోజ్జ్వలం అవుతుంది' అని. రుద్రభట్టుకూడా చెప్పాడు: ఉదారులైనవారిచరిత్రలను నిబంధించడమే ప్రబంధాలకు ప్రతిష్ఠ' అని. సాహిత్యమీమాంసలోగూడా ఈవిషయాన్ని వివరించారు: నాయకునిగుణాలతో కూర్చబడిన సుకవుల మంచి మాటలు కల్పాంతంవరకూ వుంటవి' అని. ఈవిషయాన్నే భోజరాజుకూడా 'కవివాగ్వృత్తి కొద్దిదైనా లోకోత్తరగుణోత్తరుడైననాయకుణ్ణిగనక వర్ణిస్తే విద్వాంసులుగూడా నెత్తినిపెట్టుకుంటారు' అని నిరూపించాడు.

మొదటినుంచీ గ్రంథాలు అంకితం చెయ్యడమంటూ వున్నది. అయితే ఇందులో కొన్ని భేదాలు కనిపిస్తున్నవి. ఇష్టదైవానికి అంకితం చేసేవారు కొందరు. గ్రంథం వ్రాయమని ధనసహాయంచేసి ప్రోత్సహించిన రాజుకో, లేక మరోధనవంతుడైన పెద్దమనిషికో అంకితంచేసేవారు కొందరు. తమకు ప్రేమపాత్రులైనవారికి అంకితం చేసేవారు కొందరు. ఆస్థానంలో వుండేకవులైతే, సాధారణంగా వాళ్ళకృతులు ఆ ఆస్థాన ప్రభువులకే అంకితం అవుతూ వుంటవి. అంకితంచేయబడే పురుషుల్లోనే గాకుండా, చేసే విధంలోగూడా భేదం వుంది. ఒకటిరెండు మాటలతోనే నేను ఫలానివారికి అంకితంచేస్తున్నాను, అని వ్రాస్తే ఆగ్రంథం వారికి అంకితమైపోయి నట్టుగా ఈనాడు భావిస్తున్నారు. పూర్వం అట్లా కాదు. అంకితం చేయబడే పురుషుని వంశవృత్తం అంతా గ్రంథాదిలో వర్ణించబడేది. అటుతరువాత షష్ఠ్యంతాలతో అంకితంచేయబడేది వంశవృత్తవర్ణన లేకుండా కేవలం షష్ఠ్యంతాలతోనే అంకితం చెయ్యడంగూడా కద్దు. ఈపద్ధతి అంకితాల్లో గ్రంథంలో ఎక్కడా మళ్ళా కృతిపతి ప్రసక్తే రాదు. మరొకపద్ధతి అంకితం వుంది. అదేమిటంటే ? గ్రంథప్రమేయమైన లక్షణాలకు కృతిపతి (నాయకుడు) పేరుతో ఉదాహరణాలు (లక్ష్యాలు) వ్రాయడం. ఈపద్ధతిని అనుసరించేటప్పుడు గ్రంథాదిలో నాయకుడి వంశవృత్తం వర్ణించడంగానీ, ఏమీ వుండదు. ఇంకోపద్ధతి వుంది. గ్రంథప్రమేయమే నాయకుడిచరిత్రను వర్ణించడం. ఇన్నిపద్ధతుల్లో విద్యానాథుడు అలంకారశాస్త్రాన్ని గ్రంథప్రమేయంగా తీసుకొని, ఆస్థానపండితుడు కావడంవల్ల ప్రతాపరుద్రుడికే అంకితంచేస్తూ, అంటే లక్ష్యాలన్నీ ప్రతాపరుద్రుడిపేరుతోనే వ్రాస్తూ గ్రంథానికి కూడా ప్రతాపరుద్రీయం అనే పేరు పెట్టాడు. ఈగ్రంథాన్ని రామరాజభూషణుడు నరసభూపాలునికి అంకితంచేస్తూ, అంటే లక్ష్యాలు నరసభూపాలుని పేరుతో వ్రాస్తూ, తెనిగించాడు. అయితే ఇతను గ్రంథాదిలోగూడా కృతిపతివంశవృత్తం వ్రాసి షష్ఠ్యంతాలు తగిలించాడు. 'అధికస్య అధికం ఫలం'అనుకున్నాడా!

కృతిపతి, కృతిభర్త, నాయకుడు, ఆశ్రియము, ప్రతిపాద్యము, ఉపశ్లోక్యుడు, ఇవి అన్నీ అంకితుడైనపురుషుణ్ణే చెప్పుతవి. అయితే ఈపేర్లు ఎప్పుడెప్పుడు అర్థాములో చెబుతాను. కవి స్వయంగా ఎన్నుకుంటే 'కృతిపతి' అవుతాడు. ధనమిచ్చి వ్రాయిస్తే 'కృతిభర్త' అవుతాడు. గ్రంథప్రమేయంలోని ప్రధానపాత్రి అయితే 'నాయకు'డవుతాడు. ఇందుకు ఉదాహరణం రామాయణంలోని శ్రీరామచంద్రు డనుకోవచ్చు. వైశేషికాదిశాస్త్రాలు ఈశ్వరాశ్రయంవల్ల ప్రవర్తింపచేయబడ్డవి. కాబట్టి అక్కడ ఈశ్వరుణ్ణి 'ఆశ్రియ' మంటారు. వేదాంతశాస్త్రంలో బ్రహ్మాను 'ప్రతిపాద్య'మంటారు. భారతంలోని మహాపురుషు లంతా 'ఉపశ్లోక్యలు'.

# సంధ్య

మల్లవరపు విశ్వేశ్వరరావు

కిలకిలకిల కలకూజిత
నవ్యోదయ విహంగమా !
కలకలకల చలితవర్ణ
దివ్యాంబర పతంగమా !

నిలిచితి నీ సాంధ్యవేళ
నిర్మల మామక జీవన
పరిసరముల, విస్తృతములు
పక్షోజ్జ్వల దీప్తు లురుల !

వెల్లువలా కాంతిజాలు
పెల్లున హృదయాందోళన
మెల్లన ఊళితమై, సం
ఫుల్లకాంతి ముంచెత్తెను !

నవరసాల కిసలయ సం
భవరసార్ద్ర మృదురావము,
భవ దుచ్చల పక్షాంచల
రవణము నాహృది హరించె !

పూర్వదిక్సరోజనాళ
చర్వణ మధుగళమా ! పృథు
లోర్వీతల సంధ్యాసుఖ
సర్వస్వమ ! విహంగమా !

నాజీవనప్రాంగణమ్మె
నవ్యోదయ నాట్యశాల !
నాహృదయ విహాయసమ్మె
నవసంధ్యారాగడోల !

అరుగకుమా, అరుగకుమా—
ఖరకర ప్రచండ తప్త
శరముల వసివాళ్వారుదు—
చిరమై నిలువుము, సంధ్యా !

కురియింపుము కరుణా ని
ర్ఝరపాతము నీగానము,
వరియింపుము నవశాద్వల
ధరణీ వలయావరణము !

*

# సువర్ణమేఖల

జనమంచి కామేశ్వరరావు

నేనూ, మా రాజీ ఎప్పుడూ ఇల్లాగే ఉన్నామా! అనిపిస్తోంది.

గతించినవిషకాలం, రాబోవునిషా కాలం, మాతో నిల్చివున్న ఈనిమేష కాలంతో మేళవించి, చుక్కలకూ, చుక్కలరాయనికీ కూడా ఆనంద సందేశాలను పంపుతున్నాయి.

ఎన్నినిశలో! గతించిననిద్ర మొన్న మొన్నటిదాకా ఆవలించి కలవరిస్తూనే ఉంది.

ఎన్నినిశలో! విడిచిన వేడినిట్టూర్పులూ కళ్ళల్లో మెరుగుతూండే దుస్స్వప్నాలూ కకుబంతాలను కనల్చి, సరస వృష్టిని దిగజారి విశ్వాన్ని వివశం చేశాయి.

విధివిరామంలేక జపించినమా రాజీ రాగరేఖ మొన్ననే నాదబ్రహ్మ ఓంకారంలో కలిసి వినిపించింది.

నేను ప్రేమబాధల పొగిలి, సోలి, త్రిభంగపదవి కూర్చుకొని, ఆశాప్రతీతులో కుంచుకొనిపోతూంటే, ఆమె మహారాజ్ఞియై – చిరునవ్వుచిలుకుతూల కరిమబ్బులాగ దైవతపథాలనుండి నా కెదురుగా అవతరించి తనహృదయ మలయమారుతాల ప్రసరించేది. అంత నాహృదయం మిసిమించి, కుసుమించి పరిమళించేది.

ఎవరో నింగినీలాల చాందనీ చీల్చుకొని వచ్చి నిశ్శబ్దరజనీజీమూతరాగ పరిశ్లిష్టినైనా ఆలపించక గుసగుసలుపోతూ మమ్మే తిలకించేవారు. శశిరాజును కళ్ళు మూయమని శాసించేవారు. వెన్నెలచిన్నిపువ్వులు జలజల రాల్చేవారు. పాపం! ఆలోకులకు నేనూ మా రాజీ అంటే ఎంతో యిష్టం. వారికి మాది అతిలోకసాంద్రతృష్ణ అని తెలుసు.

నా రాజి తనసుధాపునీత నిశిత దృక్కులతో నాలౌకికభావాల నన్నింటినీ దహనం చేసింది. తనదరహాస వల్లిక నాహృదయంలో నాటి, అంటు కట్టి, విరులతోట పెంచింది. నాచూపు మేరదూరంలో ఉండి యిద్దరిమధ్యనూ విశ్వాన్ని యిమిడ్చింది. నాకూ మా రాజికీ విశ్వమే విడనికౌగిలైంది. నేను,రాజికౌగిలిలో విశ్వముంటూంటే వెర్రిగా పొగిలి కనలిపోయేవాణ్ణి. నన్ను విశ్వంలోవాణ్ణిగా చూసేది కాదు. నన్ను తనకౌగిలిలోనికి చేరనిచ్చేది కాదు. నన్ను విశ్వంలోనుంచి వేరు చేసేది.

ఎందు కిల్లాచేస్తావు రాజీ? అంటే: విశ్వాన్ని తనఅనంతబాహువులూ చాచి కౌగిలించుకుంటూంటే నేను పైనుంచి చూడాలిట! చూచి మారాజిశక్తిసంపద లెంతవో అని మెచ్చుకోవాలిట!

నేను విశ్వాన్ని కౌగిలిస్తూంటే తనేమో దూరదూరాలకు తప్పుతూ తారిపోయి, విశ్వం నాకౌగిలిలో ఇమిడాక, నాఎదుట నిల్చి పకాపకా నవ్వుతుంది. ఏమి నవ్వుతావు రాజీ! అంటే విశ్వాన్నంతటినీ కౌగిలించుకుంటూన్నా నేను ద్విబాహినే యనిట!

*  *

ఆరేయి విశ్వమంతా అవశమై నిశ్చలసుషుప్తిలో మునిగివుంది. నేనంత చేతులు దొప్పగట్టి ముఖానికి దోయిలుంచుకొని నాలోకూడా అనంత బాహువులు ఎప్పుడు విరిసికొనిపోతాయి రాజీ! అని అడిగాను.

'ఎప్పుడు నీవు నన్ను చూడగా ప్రేమపొగలు చిమ్మకుండా, త్రిభంగ పదవి కూర్చకుండా, అవలోకితేశ్వర స్వామిలా నిల్చుండిపోతావో అప్పుడు!' అని సన్నగా నాసందేహానికి సందేశం పంపింది రాజి.

అయ్యో! నే నింకా అల్పమర్త్యుడనే! అని వెరగుతో నైస్పృహ్యం పొందాను నేను. అంతలో విశ్వరూప సందర్శనం నాదృష్టినుండి మాసిపోయింది. చీకటే కమ్మింది- నన్నూ మా రాజిని కూడా!

ఆమె కొంతసేపు నభోలక్ష్మినీలి చెరగులో దాగుంది. తరువాత వాలుజడ నల్లకుంచె చేతపట్టుకొని అల్లాల్లా తరలిపోయింది- స్వర్గపేటిలో దాచుకున్న కిరీటంమీాద చిత్రితమైన నా రూపం చెరిపెయ్యాలని-

ఒకసారి తారామోహనమూర్తి నన్ను ఎర్రగా చూచి, రెండు కరుణాశ్రువులు రాల్చి, "పీడి బ్రతు కింతే!" అని తననీలిసౌధంలోని మధుమందిరం చేరుకున్నాడు. తారలన్నీ రాజుగారి అరుణదృక్కులు ఓర్చుకొనలేక, కోపాతిరేకముచేతనే కాబోలు ననుకొని గబగబా భువికి రాలిపోయినాయి. నే నంతే అల్లా నిల్చిపోయినాను.

చీకట్లు కమ్మినాయి. నారాజి మళ్ళీ నావైపుకే యాత్ర సాగించింది. వెక్కి వెక్కి పసిగోలగా ఏడుస్తూన్న నన్ను చూసింది. ప్రసన్నత దొరకించుకొన్న హృదయ మవడంచేత నన్ను కామించింది. నన్ను చేరి నవ్వుతూ తనకరాలింగనాల్లో భూర్భువర్లోక దృశ్యాలు చూపింది. జలజల స్రవిస్తూన్న నాసెలజాలు తనలోనికి పారించుకుంది. దివిజగంగ తనలో ఇముడ్చుకున్నట్టే నవ్వుతరగల చిమ్మింది.

*  *

ఇంతలో ప్రళయం కమ్మినట్టైంది. వియత్తలపు నీలిపరుపు టాకాలన్నీ తెగిపోయినాయి. ఫేనరాసులన్నీ ప్రళయ ఝంఝానిలంలో కలిసి ఆశాంతాల కెగిరిపోయినాయి. నభోలక్ష్మి కార్మొయిలు పెదవుల విప్పి. దంష్ట్రాగ్ని చిమ్మి ప్రళయభీకరంగా మృత్యుకేళి సలిపింది.

అపుడొక్క మెరపు సువర్ణమేఖలై మమ్ము ఆవరించింది. మరొక్కటి మమ్ము స్వర్గపుద్యానాల్లో దింపింది.

ఆసువర్ణమేఖల మమ్మింకా కుదిస్తూనే ఉంటుంది. మేము చేతులు పట్టుకొని "ఒప్పులకుప్పా! ఒయ్యారి భామా!" అని ఆడుతూ, తాండవ నృత్యకేళి చేస్తాం. మామధ్యనే విశ్వం ఆడుతూ పాడుతూ హాయిగా శరన్మేఘశకలమట్లు తేలుతూంటుంది. అప్పుడా మేఖల కరిగి చిన్నిచిన్ని గీతులై మాకు ప్రేమ సంగీతం వినిపిస్తుంది.

విశ్వం అవశమై వుంటే మేఖల మమ్ములను కుదించుకుంటుంది. మేమంత అనంతంలోనికి సాగిపోయి కేరుకుంటాం. మళ్ళీ విశ్వం మేల్కొనగానే దాన్ని మావిడని కౌగిల్లో యిముడ్చుకుని శ్రావ్యగీతుల లాలించి తేలిస్తాం; ఇదే మా ఎడలేని ఆట.

*

# స ఖి !

వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య

బాల సహకారపల్లవ ప్రాశనాత్త
కుహుకుహూరావరమ్య పుంస్కోకిలముల
నెలమి నోరూరజేయు నీవెలుగులోని
మసృణమారందనిష్యంది మధురిమంబు!
అంటుమామిడిపండ్ల రసామృతంబు
వలపుబలుకులతో బాంధవంబు నెరపు;
తళుకువజ్రాలపడగల త్రాచుతోడ
పూలు దురిమినవేణి దోబూచులాడు!

ప్రావృడంభోదముల పరవళ్ళ ద్రొక్కు
మెరపులకుగూడ మెరగినుమేని మెరుగు
బాహ్యసౌందర్యముకంటె బదిలమైన
ఆత్మసౌందర్య మొకడునీయందుగలదు!
నింగి జాబిల్లి పున్నమనిశల గాయు
వెన్నెలల మీరి నవ్వులు మిన్ను ముట్టె!
జీవనాధారమైన నీమోవి యొకడె
సారమీ మాయదారి సంసారమందు!

# ప్రకృతి – భావకవిత

పాటిబండ మాధవశర్మ

విశ్వసాహిత్యానికి శ్రీకారమైన వేదాల్లో ఉత్తమోత్తమకవిత్వం ప్రకృతిని అధికరించి వున్నది. అవ్యాహతంగా ఆరునెల్లు గాఢాంధకారంలో మునిగివుండే ఉత్తరప్రాంతనివాసులయిన ఆర్యులు చీకటితెరలను చీల్చుకుని విరుసుకువచ్చే అరుణకాంతుల్ని చూసి బ్రహ్మానందపరవశు లయేవారు. కన్నుగానని గాఢతమస్సులను విరియించి ప్రత్యక్షసత్యమయిన ప్రకృతిస్వరూపాన్ని చిరకాలానికి ప్రకాశింపజేసే ఆదివ్యతేజస్సును గూర్చి వారిసుకుమారహృదయాలు ఆనందంతో పొంగి గానం చేసేవి. స్వచ్ఛమూ, కోమలమూ, చిన్మయమూ అయిన ఆ అరుణతేజాన్ని శిశువుయొక్క నిర్మలమధురహాసంగా, కన్యయొక్క చిన్నారిసిగ్గుగా, మాతృదేవియొక్క ప్రేమార్ద్రవీక్షణాగా, ఆదిశక్తియొక్క కరుణాప్రసాదంగా భావించి స్తోత్రం చేసేవారు. ఋగ్వేదంలోని ఉషస్సూక్తాలు, నిరాడంబరములూ, నిర్మలావేశపూరితములూ, నిసర్గమధురములూ, అయి వున్నవి.

ప్రకృతిసంతానమై, ప్రకృతి ఉత్సంగమందు జీవితం గడపిన ఆర్యులు, సృష్టిలోని సమస్తవస్తువులనూ బిడ్డలుగా, తల్లులుగా, మిత్రములుగా, విశేషించి ఆత్మవతుగా భావించి ప్రసన్న – ఆనందమయజీవితం గడిపేవారు.

కాలక్రమాన మానవుడు లోకతంత్రములందు వ్యగ్రుడై విశాలమైన ఈ ప్రకృతిలోని జీవరాసులను – జడములనీ, చేతనములనీ, స్థావరములనీ, జంగమములనీ – తెగలుతెగలుగా విడగొట్టి ప్రాణిప్రాణికీనడుమ అభేద్యములయిన విభాగభిత్తికలను నిర్మించాడు. కాని :

అంతరాంతరములందు మనలో ప్రవహిస్తున్న ఆర్యరక్తంలో సనాతనమైన ఈవిశ్వప్రకృత్యేకత్వము మిళితమయే వున్నది. విశాలహృదయులయిన కవులయం దీభావము నిత్యజాగృతమై నిల్చి ఎడనెడ వ్యక్తమవుతూనే వున్నది. కాళిదాసాదిమహాకవులు భిన్నరూపమైన ఈ అనంతప్రకృతిలో అంతర్లీనమై ఉన్న ఏకత్వాన్ని లెస్సగా ఆరాధించినవారే.

సామాన్యమానవుడు సాటిమానవుడితో ఏకత్వం భజించగలడు. మరికొంత సంస్కారం గలవిశాలహృదయుడు జంతుకోటితోగూడా ఏకత్వం పొందవచ్చు.

అపరిమిత భావనావిలసితులూ, అతీంద్రియానుభావులూ అయినకవులు సర్వ ప్రపంచాన్నీ ఏకదృష్టితో చూసి సర్వప్రకృతితోనూ తాదాత్మ్యం పొందగలరు.

లోకంలో సూర్యచంద్రనక్షత్రాదులూ, ఋత్వాదికాలవిభాగాలూ, నదీ పర్వతకాంతారాదివస్తుజాలమూ ఉన్నంతవరకున్నూ కవులు వీటినిగురించి గానంచెయ్యకుండా వుండలేరు. సుఖదుఃఖాదులవలెనే శీతాతపాదులనూ కవి ఉపేక్షించి వుండలేడు.

పూర్వాంధ్రకవులు ప్రకృతిని కేవలమూ ఏమరివున్నారని చెప్పలేము. కాని మానవజాతిహృదయం కశ్మలమై, దృష్టి భౌతికమైపోయిన తరుణంలో తెలుగు కవిత్వం ప్రారంభమై ఉండడంచేత కవులు ప్రకృతిని యథోచితరీతిని ఆరాధించ లేక పోయినారు.

ఇతివృత్తం అతివిపులం కావడంచేత తత్కథనంలో నిమగ్నుడై పురాణకవి ప్రకృతివంక నిదానించి చూడడానికైనా అవకాశం లేనివాడైనాడు. ప్రబంధకవి ప్రకృతివర్ణన లక్షణరీత్యా అనివార్యం కావడంచేత ఎడనెడ ప్రకృతివంక కన్నెత్తి చూసినా దానిబాహ్యస్వరూపాన్నే దర్శించగలిగినాడు గాని అసలు తత్వం అనుభవించలేక పోయినాడు. ప్రకృతి అతన్ని ఆకర్షించి అతనికావ్యంలో ప్రవేశించలేదు. విధి లేక కవియే దాన్ని కావ్యంలో నాటుకున్నాడు. ప్రబంధా ల్లోని ప్రకృతి లక్కబొమ్మ. ప్రకృతికి ఛాయానుకృతి అయిన నిర్జీవప్రతిమ.

ప్రకృతిని విధిగా వర్ణించితీరాలని - అంటే ఆవర్ణన వుంటేనేకాని తమరచ నకు శాస్త్రనిర్ణీతమైన కావ్యత్వం సిద్ధించదేమో అనేభయం - భావకవులకు లేదు. భావకవి ప్రకృతి తన్ను ఆకర్షించినప్పుడు - తాను దానితో తాదాత్మ్యం పొందగలిగినప్పుడు - అప్పుడే దాన్ని తనకావ్యంలో ఆరాధిస్తాడు. ఇందుచేతనే భావకవుల ప్రకృతికావ్యములు సచేతనములూ, గంభీరములూ అయి ఉన్నవి.

ప్రపంచంలో పదార్థవాదం పాతంముట్టింది. భౌతికమైన నశ్వరరూపమే సత్య మనే వాదం ప్రబలింది. కాని :

నేటికి తిరిగీ కవులకు దీనియెడ విముఖత్వం కలిగింది. సత్యాన్వేషణకు నూతన చైతన్యంతో బయలుదేరినవీరికి పురాతనమైన ఆర్యఋషుల ప్రకృతియే శరణ్యా మైనది. పదార్థవాదంతో విద్వేషాలు పెంచుకుంటున్న ప్రపంచంలో ఊపిరిసలపక కవులు విశ్రాంతి, చైతన్యం, సౌందర్యం ఆశించి ప్రకృతిని ఆశ్రయించారు. ఊహా జనితమయిన ఆభాసతృప్తిని పొందక ఆర్ద్రహృదయంతో ప్రకృతితో సానుభూతి పొంది అక్షయమైన దానిచైతన్యసారాన్ని అనుభవిస్తున్నారు. బలాత్కల్పితమైన

ప్రకృతిలోని భిన్నత్వాన్ని ధిక్కరించి, కవులలో యుగయుగాలుగా అణిగివున్న ఆర్షఋషిత్వం తిరిగీ తలసూపుతున్నది. మానవుడికి సహజములైన బాంధవ్యము లన్నీ కవి ప్రకృతిలో దర్శించుకుంటున్నాడు. తల్లిగా, ప్రేయసిగా, దేవిగా, సోదరిగా ప్రకృతిని ధ్యానించి తెంపరానిమూలసూత్రములను ఆత్మనా అనుభ విస్తున్నాడు. భావకవి ప్రకృతియందు చైతన్యమూ, మానవత్వమూ అరోపిస్తు న్నాడు అనేమాట తప్పమాట. అనుభవిస్తున్నాడు అనడం సూక్ష్మతరసత్యము.

ప్రకృతి నధికరించిన ఉత్తమభావకావ్యములు వ్రాసినకవులు తెలుగులో చాలామంది వున్నారు. కావాలంటే : పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంక టేశ్వరరావు, విశ్వనాధ సత్యనారాయణ, దువ్వూరి రామిరెడ్డి, కవికొండల వెంకటరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి,అబ్బూరి రామకృష్ణరావు, శ్రీరంగం శ్రీనివాసరావు, కొడాలి ఆంజనేయులు మొదలయినవారి కావ్యాలు చదవండి. భావకవు లందరూ అంతో ఇంతో ప్రకృత్యుపాసకులే. ఏవిషయాన్ని విస్మ రించినా ఈకవుల ప్రకృతికావ్యాలు మాత్రం ఉదాత్తభావబంధురములై, ఉత్తమ ములై ఆంధ్రవాఙ్మయానికి శిఖరప్రాయములుగా వున్నవనడంలో సాహసంగానీ అత్యుక్తిగానీ ఏమాత్రమూ లేదు. ప్రకృతిని ప్రియురాలుగా, మాతృమూర్తిగా, మహాశక్తిగా ధ్యానించి, భావించి, అనుభవించి విశ్వసాహిత్యమునందే అత్యు న్నతస్థానాన్ని ఆక్రమించదగిన ఉత్తమకావ్యాలు వ్రాసిన ఈభావకవులు మనకు సర్వధా ఆరాధ్యులుగా వున్నారు.

చైతన్యంగలకవి నిరంతరమూ పరిణామం పొందుతున్న ప్రకృతిసౌందర్యం చూసి పరవశుడు కాకుండా వుండలేడు. లోకంలోని వైషమ్యాలతో, వేదనలతో, ద్వేషాలతో కుంగిపోయినహృదయానికి శాంతి, సౌఖ్యం, ఆనందం ఇయ్యగలది ప్రకృతి. సంకుచితదృష్టితో నాలుగుగోడలమధ్యా నిలుచున్నంతకాలమున్నూ మానవుడికి తనప్రాధాన్యమూ, ప్రత్యేకతా గోచరించకమానవు. అనంతములైన ప్రకృతిదృశ్యములమధ్య నిలిచి కనులు విప్పి చూచినప్పుడు మానవుడు తన పర మాణుత్వాన్నీ, ప్రకృత్యేకదేశత్వాన్నీ, గ్రహించుకోగలుగుతాడు. విశాల మైన ప్రకృతిని ఏకదృష్టితో భావించగలిగినప్పుడు మానవుడు తన అనంతత్వా న్నీ, తనవిశ్వమూర్తినీ అనుభవించగలడు.

కొంపెల్ల జనార్దనరావు వ్రాసిన "ప్రకృతిలాస్యము" అనే కావ్యాన్ని పరా మర్శించి ఈవ్యాసాన్ని ముగిస్తాను.

“ సతతనూతన మృదువిలాసప్రభూత
తావకమనోజ్ఞలాస్య సందర్శనమున
నాదుభావాలు మధురగానమ్ము సలిపె
ప్రకృతి! ఆనందతన్మయత్వమున మునిగి.

* *

“ ఆ దయాశీకరాసార, మా పవిత్ర
విశ్వమోహనమైత్రి, యా ప్రేమమధుర
మంగళాకార, మా తపోమహితముద్ర;
అహహా! ఎంతేసి కానుక లబ్బె నాకు?

* *

“ ఎవరికొఱకు నీనాట్యంబు, లేప్రపూత
గానసంచారఫణితు లేకాంతకాంత
నృత్యవైదగ్ధ్యమును ప్రసాదించె నీకు
అనుచు ధ్యానించినా నప్రయత్నముగను.

“ ధ్యాన మది గానమైపోయె, తావకీన
ప్రణయసౌభాగ్యమహిమ; నాప్రశ్నములకు
నేన చూపట్టితిని సమాధానమునయి;
నీవలన నాయనంతత నేర్చుకొంటి?

*

# "మా లిఖ!"

బొడ్డు బాపిరాజు

ఇతరపాపఫలాని శతాని వా
వితర తాని సఖే చతురానన
అరసికాయ కవిత్వనివేదనం
శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ.

*

ప్రసవపేశల పదశయ్య పరచినాను
విశ్రమించుత సత్కళావిబుధచిత్త
బంభరము లిందు, నవమధుస్వాదనమున
అలయికలు వాసి నిత్యభోగానురక్తి!

ప్రకృతిశుభరూప మర్పించు పరవసించి
బయలు వెడలించినాడ కావ్యస్రవంతి;
రసికరాజహంసల సముల్లాసలీల
కర్హ మగుగాక మధురభావార్ద్రభణితి!

మోహనానందమయ రమ్యమూర్తి, మృదుల
చరణవిన్యాస, పరిణతస్వాంత, మిగుల
కష్టపడి కన్నయట్టి నా కావ్యకన్య
నప్పగించెద రసికహస్తాబ్జములకు.

*

రావలదు పొండు! మంజులారామవాటి
ఇది రసజ్ఞులు మసలుచో, టీవనంత
వికసిత లతాంతపరిమళ వీచులందు
వెగటు నింపకుడో యనభిజ్ఞులార!

అభ్రగంగాసరిత్తీర హారిసైక
తము లివి విరామయోగ్యభూతలము లగును
సుకృతసంపన్నులకు; సింధు చొరగవలదు
పంకిలాంఘ్రులు శుష్కజీవనులు మీరు !

తీర్చి దిద్దిన దీ లలంతికను దాల్చ
నైనది విశాలరసిక హృదంతరంబు ;
పట్టిబూడిద బొర్లాడునట్టి విరస
రాసభములార! మీకాశ్రయాన మేల?

అంబునిధి త్రచ్చి తెచ్చినయమృతకలశ
మిది విబుధులకు గాక మీ కెత్తు రెవరు?
హృదయములు లేని నరులార ! ఏగు డింక
దారి బట్టి ; మాగొడవలు తడవ వలదు !

*

ఓయి, చెలికాడ ! చతురాస్య వ్రాయువోయి
యితరదురితానుభవముల నిచ్చుకొలది,
విరసజనులకు కావ్యనివేదనమ్ము
నలుపు తలవ్రాలు వల, దపల్ వలదు, వలదు !

*

# నాలో మార్పు

**శ్రీ శివశంకర శాస్త్రి**

౬

మిత్రులు హోతా స్వామిశాస్త్రిగారు మదరాసులో నా కేదో ఉద్యోగం కుదిర్చారు. చెన్నపట్నంలో కొన్నిమాసాలు ఉండవలసివచ్చింది. నేను చేరిన వ్యాపారసంస్థ ప్రారంభస్థితిలో ఉండేది. వాళ్ళు అస్తమానమూ డబ్బుసంగతి మాట్లాడుతూ ఉంటే, నాకు తలనొప్పి వేసేది. నేను చేయవలసినపని ఏమీ కనపడేది కాదు. ట్రెయినిం గవుతున్న చింతా దీక్షితులుగారు, ఇంజనీరింగు చదువుతున్న కొడవటిగంటి సుబ్బయ్య మధ్యమధ్య వచ్చి కాస్త ఊపిరి పోస్తూ ఉండేవాళ్ళు. అక్కడ సంస్థలో పుస్తకాలు లేవు. యుద్ధం బాగా సాగుతున్నరోజులవి. నాకు జర్మనీమీద చిన్నప్పటినుంచీ అభిమానం. ఆదేశంలో సంస్కృతం ఎక్కువగా చదువుతారనీ, మనవేదాదివాఙ్మయం అంతా తర్జుమా చేశారని, వింటూవుండేవాణ్ణి. ఒక 'గెటే' కవిపుస్తకాలు చదవడానికైనా జర్మన్ భాష నేర్చుకోవడం ఉత్తమ మనిపించి ఆభాషాభ్యాసం ప్రారంభించాను. జర్మనీదేశానికి 'డాయిష్‌లంట్', జర్మన్ భాషకు 'డాయిషన్‌స్ప్రాకెన్' అని పేర్లు. ఇలా కాలం గడుపుతూ ఉండగా హెన్రిక్ ఇబ్సెన్ నాటకసంపుటాలు రెండు చదవడం సంభవించింది. ఇబ్సెన్ నార్వేదేశస్థుడు. 'Doll's House' మొదలైనవి చదివేసరికి నేను పునర్జన్మ ఎత్తినట్లయింది. సంస్కృతనాటక రచనాపద్ధతికీ అదివరకు ప్రపంచంలో నాటకాలు రాస్తున్నపద్ధతికీ ఇబ్సెన్ అవలంబించిన విధానానికీ తేడా కనపడ్డది. షేక్స్‌పియర్‌ప్రభృతుల రచనలమీద ఆదరం తగ్గిపోయింది. అప్పటినుంచీ నవలలకన్న నాటకాలమీదికి దృష్టి ఎక్కువగా వెళ్ళింది.

1916 సంవత్సరంలో 'గ్రంథాలయసర్వస్వము' వ్యాప్తిలోకి వచ్చింది. ఉద్యమానికి ఉపకరించడమే కాకుండా సాహిత్యానికికూడా ఆపత్రిక కొంత తోడ్పడుతూ ఉండేది. రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణరావు, బసవరాజు అప్పారావు మొదలైనకవులరచనలు అందులో ఆసక్తితో చదివేవాళ్ళం. మొదటి యిద్దరు కవులూ అంతకుపూర్వమే పద్యకావ్యాలు ప్రకటించారు. వచనరచనలో గ్రంథాలయసర్వస్వము కొద్దిగా నూతనమార్గం తొక్కింది. భాషమట్టుకు గ్రాంథికమే. మేమంతా ప్రారంభింతా మనుకొన్న పత్రికాలక్ష్యాలు

అందులో అట్టే కనపడలేదు. నాకు ముఖ్యంగా పాశ్చాత్యప్రసిద్ధమాసపత్రికల విధానం నాటికీ నేటికీ చాలాయిష్టం. కొంతకాలం ఆగి మాసమాసపత్రిక ప్రక టించాలని అనుకొన్నాము.

## ౭

ఇంతలోకే నేను బొంబాయి వెళ్ళి సర్ జేజేస్కూల్ఆఫ్ఆర్ట్సులో ప్రవేశించాను. నాకు 1908 సంవత్సరంనుంచీ శిల్పంమీద అభిలాష ఉండేది. తెనాలిలో స్వామి శాస్త్రిగారితో మైత్రి ఐనదగ్గిరనుంచీ అభిలాష మరీ హెచ్చింది. ఆయనదగ్గిర చిత్రకారులగ్రంథాలు అనేకం ఉండేవి. **Leighton, Poynter, Burne-Jones, Alma-Tedema, Herkomer, Millet, Italian** శిల్పులు వగైరా పుస్తకజాలం సచిత్రంగా మథించినాను. శిల్పిని కావలె నన్న వాంఛ గాఢమైంది. బాబూరావు ముందే బొంబాయిలో చిత్రకళ అభ్యసిస్తూ ఉన్నాడు. నేనుకూడా వెళ్ళాను. కళాశాల ఉపాధ్యాయుడు మహాదేవ విశ్వనాథ్ ధురంధర్. నన్ను **Modeling Section** మొదటితరగతిలో చేర్చుకోమని ఆయన్ని కోరాను. సీ.చిత్తరువు లేవీ అని ఆయన అడిగితే లేవన్నాను. అయితే చేర్చుకొనేందుకు వీలు లేదన్నారు. నా కేమీా తోచింది కాదు. అప్పుడు **"I have come all the way from Andhra-"** అన్నాను. **"What is Andhra?"** అని ధురంధర్ ప్రశ్నించాడు. **"Maharattas are the descendants of Andhras; So says Bhandarkar"** అని నే ననేసరికి నన్ను ఆయన ఎగా దిగా చూసి **"Shall I take you into the second year class?"** అంటే **"No thanks"** అని మొదటితరగతిలో చేరాను. అప్పటికి ఆంధ్రదేశనామము బాగా వ్యాప్తిలోకి రాలేదు. గుంటూరువాళ్ళం కావడంచేత ఆంధ్రోద్యమంవిషయమై మాకు చాలా పట్టుదల ఉండేది. బొంబాయిలో ఆంధ్రులకు చాలాఖ్యాతి అని తర్వాత తెలిసింది. ధురంధరుకు నామీాద కోపం రాలేదనీ, వింతపడ్డాడనీ గ్రహించి మనశ్శాంతి పొందాను. బొంబాయినగరంలో వున్నరోజుల్లో నేను తారకనాథగంగూలీనవల "అదృష్ట" తెలుగుచేస్తూ ఉండేవాణ్ణి. మహారాష్ట్రభాష నేర్చుకోవలెనని అభిలాష కలిగినా, అభ్యసించడానికి అవకాశా లున్నా తర్వాత రెండుసంవత్సరాలకు గాని నేర్చుకోవడం సంభవించింది కాదు.

## ౮

బొంబాయిలో కొంతకాలం వుండి విఘ్నదేవత నెత్తి అడవడంవల్ల బయలు దేరి మధ్య సికింద్రాబాదులో మకాము వేసి మళ్ళీ సకుటుంబంగా తెనాలి చేరు కున్నాను. మిత్రులు వీరరాఘవస్వామిగారు, పెద్దిభట్ల పూర్ణశర్మగారు మాట వరసకు సికింద్రాబాదు వెడతామని తెనాలిలో అన్నారట. ఆమర్నాడునుంచీ ఎరిగినవాళ్ళంతా, ఇంకా ఎప్పుడు ప్రయాణం అని అడుగుతూంటే పోరు పడ లేక వాళ్ళిద్దరూ సికింద్రాబాదు వెళ్ళి కొన్నాళ్ళు ఉన్నారు. మేమంతా కలిసి తిరిగి వచ్చాము. తరవాత కొన్నాళ్ళదాకా 'సికిందరాబాకము పోయినాముగా' అని వీరరాఘవస్వామిగారు ఉపజాతిపాదం పాడుతూ ఉండేవారు.

ఏం చేదామని మథన పుట్టింది. శిల్పంమీద అభిమానం గాఢంగా ఉన్నది. అభ్యాసంచేసేందుకు తెనాలిలో ఆనుకూల్యంలేదు. అయితే అదృష్టవశాత్తు నూతలపాటి నరసింహం నాయుడుగారు కనపడి బెజవాడలో శిల్పకళాశాల చిన్నది స్థాపించినట్టూ, అక్కడికి నన్ను రమ్మనీ, చెప్పారు. అప్పటికి నాయుడు గారు శిల్పాష్టకనేత; తర్వాత మరికొన్ని సంవత్సరాలకు శతశిల్పిగా మారారు. ఈపేరే ఎక్కువగా ప్రచారంలోకి వచ్చింది. అదివరకు రెండుసంవత్సరాలనుంచీ ఆయనకూ నాకూ బాగా పరిచయం. నాయుడుగారంటే తెలగా లనుకున్నాను. నరసింహంగారు తాము కమ్మవార మనీ, కమ్మప్రభువు రాజా వాసిరెడ్డి వెంక టాద్రిగారికి నాయుడు అని బిరుదు ఉండేది అనీ, నాయకుడు, నాయడు, నీడు— ఇవి కమ్మవారి పేర్ల చివర ఉంటవనీ, చౌదరీ అనేది ఆమధ్య అవలంబించిందనీ అన్నారు.ఆయనకు రెండుకళల్లో ప్రవేశం ఉన్నప్పటికీ, బాగా తెలిసింది దేవతా విగ్రహాదులకు సర్వాంగాభరణాలు చేయడం మాత్రమే.

నరసింహనాయుడుగారు మంచివాడు. నేను బెజవాడ వెళ్ళినతరవాత శిల్ప కళను గురించి పత్రిక పెడదామని అన్నారు. నాకూ ఉత్సాహం పుట్టింది. ఇప్పుడు తలచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది! ౨౮ ఏళ్ళవాడికి సాహసం జాస్తి - సరుకు తక్కు వయినా! ఇంతలోకే వఝ్ఝ బాబురావు బొంబాయి చిత్రకళాశాలనుంచి వచ్చి నాడు. అతన్నికూడా నాయుడుగారు ఆహ్వానించి చిత్రకళాశాలలో ఉపాధ్యా యుడుగా తీసుకున్నారు. మేము ముగ్గురమూ పత్రిక నడుపుదామని నిశ్చయించు కున్నాము. నేను సంపాదకుణ్ణి. అదివరకు చూసిన **Academy, Burlington Magazine** మొదలైన ఇంగ్లీషు చిత్రకళా ప్రచురణలమోస్తరుగా చెయ్యావలె నని కోరిక. మనదేశశిల్పాన్నిగురించి నాకప్పటికి తెలిసింది స్వల్పం. పాశ్చాత్య

చిత్రకారుల ప్రభావం చాలా హెచ్చు. ఇంగ్లీషుపదాలు పడకుండా వ్యాసాలు రాసేశక్తికూడా అంతంతమాత్రమే. నిజంగా ఆపత్రికే వచ్చినట్టయితే ఎంత అసహ్యంగా ఉండేదో! కంటికి కనపడని Spiritual Helpers అడ్డుపడి ఆయత్నం సాగనివ్వలేదని ఇప్పు డనుకుంటాను. నాయుడుగారూ నేనూ కొద్దిగా ప్రచారానికి బయలుదేరి కొద్దిప్రదేశాలకు వెళ్ళి పత్రికాప్రకటన ఉద్దేశం క్రమంగా మాను కున్నాము.

ఐరోపాసంగ్రామము జోరుగా సాగుతున్నరోజులు. బెజవాడకు ఎవరో Recruiting Agent వచ్చి ఏదో సందర్భవశాన మాదగ్గిరికి వచ్చాడు. చిన్నప్పటినుంచీ యుద్ధా లంటే ఇష్టం. పురాణాల్లో వర్ణించినపోరాటాలూ, దేశచరిత్రల్లో వర్ణించినయుద్ధాలూ మొదలైనవి చదివి ఉండడంవల్ల యుద్ధం అంటే సరదా. దానికితోడు బొమ్మలు చూస్తూఉండడం. హుషారు పుట్టి నేను యుద్ధానికి వస్తా నన్నాను. ఏజంటు నావాలకం చూసి చొక్కా విప్పించి పొడుగూ ఛాతీ కాళ్ళూ చేతులూ కొలిచి “ మిమ్మల్ని సైన్యంలో చేర్చుకోడానికి వీ ల్లే” దన్నాడు. నేను దిగాలుపడి ఎందుచేత అన్నాను. “ మడమలు తగిలించి నిలుచున్నప్పుడు మోకాళ్ళు కొద్దిగా తగులుతున్నవి. అందుచేత ” అన్నాడు. అవయవసౌష్ఠవమూ, దేహదార్ఢ్యమూ ఉన్న ననుకుంటున్న నాకు ఇదేదో లోటు అనిపించింది. ఏజంటు తీరా ఒప్పుకుంటే వెళ్ళేవాడినో కానో! ఇంట్లో భార్య నేను వెళ్ళడానికి ఎంతమాత్రం అంగీకరించదు. మొత్తంమీద మాట దక్కింది.

ఆరోజుల్లోనో అంతకు కొన్నిమాసాలు ముందో రెండురోజులన్నర ఉద్యోగం చేశాను! పెనగపల్లి రామస్వామి గుప్తగారు మా మామగారి శిష్యులు, మా కుటుంబంమీద గాఢాభిమానం కలవాడు. ఆయన మాటలాడుతున్నా, ఉపన్యసిస్తున్నా శ్రోతలను నవ్వించేవాడు. దేశాభిమానం బాగా ఉన్న గుప్తగారు ‘ ఆర్యవైశ్య ’ అనే వారపత్రికను నడుపుతూఉండేవాడు. ఆయనకు నామీద చాలాప్రీతి. అల్లుడూ అల్లుడూ అని పిలుస్తూ ఉండే వాడు. ఒకసారి ఆపత్రికకు నన్ను సంపాదకుడుగా రమ్మని చాలా బలవంతం చేశాడు. సరే అని వెళ్ళితిని. గుంటూరులో నల్లపాడురోడ్డువైపు ఒక ఇంట్లో ఆపత్రికా కార్యాలయము. రచనలో నాకు సహాయంచేసే రెండోమనిషి లేడు. రెండురోజులన్నర ఉండి ఏవో రాసి, “ మామగారూ పని ఉంది. రెండుమూడురోజుల్లో తిరిగి వస్తాను ” అని ఆయనదగ్గిర సెలవు పుచ్చుకున్నాను. బుద్ధిమంతుడు గుప్తగారు నావాలకం కనిపెట్టి “ మీరు మళ్ళీ రారు ” అన్నాడు. “ తప్పకుండా వస్తాను మామగారూ! ” అన్నాను. కాని మళ్ళీ కొన్నిమాసములకుగాని ఆయనకు కనబడలేదు. నవ్వుతూ క్షమాపణ చెప్పాను.

పత్రికాప్రకటన అభిలాష అనేది శల్యగత మైపోయింది. ఒకరిపత్రిక నడపడంకన్న స్వతంత్రంగానే నడుపుదా మని కుతూహలం. చిన్నప్పట్నించీ ఎక్కడ ఉన్నా నలుగురుస్నేహితులూ చుట్టూ ఉండడం మామూలు. జాతకంలోకూడా "బహుమిత్రవాన్" అని ఉన్నది. ఒకనాడు కొండవటిగంటి సుబ్బయ్యఇంట్లో కూర్చుని ఇష్టాగోష్ఠిలో ఉండగా అందులో ఒకరు మనం పత్రిక పెట్టాలి అన్నారు. వీరరాఘవస్వామి, సుబ్బయ్య, కోపల్లె శివకామేశ్వరరావు, నేనూ-నలుగురమూ ఉన్నాము. అమెరికాలో **Atlantic Monthly** ఆరంభించినప్పుడు నలుగురుమిత్రులే- **Emerson, Holmes, Longfellow, Russell** ఉండి చర్చచేసి నిర్ధారణకు వచ్చినట్టు ఎక్కడో పత్రికలో చదివినసంగతి జ్ఞాపకం వచ్చింది. అధికోపమానం అయినప్పటికీ అందరం నవ్వుకున్నాము. నామకరణంలో చర్చ బయలుదేరింది. సాహిత్యవిషయక పత్రిక చేతా మనుకున్నాము. కాబట్టి 'సాహితి' పత్రిక అంటే బాగుంటుం దని తేల్చాము. సంఘానికి "సాహితీ సమితి" అని పేరు నిర్ధారణ చేశాము. ఆపేరు ఆక్షేపించినవాళ్ళు ముగ్గురు ఉన్నట్టు తరవాత ఏడెనిమిది సంవత్సరాలకు తెలిసింది. సాహితీసమితి సభాపతి అనే మాటలో పునరుక్తి ఉన్నట్టు ఎంచినవిద్వాంసునిపేరు చెప్పను. ఆయనకు పెద్ద బిరుదులు ఉన్నవి. రెండవవారు నామిత్రులు చివుకుల అప్పయ్యశాస్త్రిగారు తమగర్గభాగవతప్రతి నా కిస్తూ సాహితీసమితీపతి శివశంకరశాస్త్రిగారికి అని రాశారు!

పత్రిక ప్రారంభించా లనేపట్టుదలే గాని పైసా తగినంత చేతులో లేదు. అచ్చుదగ్గిరనుంచి అందంగా వుండా లని అభిలాష. చూసిన ఇంగ్లండు, అమెరికా పత్రికలు అద్భుతంగా వున్నాయి. ఆంధ్రదేశంలోకూడా అలాంటి దొకటి అన్నాదాదులము ప్రకటించి ఏమో చెయ్యాలని భ్రమ. జీవితంలో నేను అనుకున్నపని త్వరలో అయింది ఇంతవరకు లేదు. 1920 లో 'సాహితి' బయటికి తేగలిగాము. సమితిసభ్యుడు కొమ్మూర్మరి హనుమంతరావు స్వతంత్రుడై డబ్బిస్తేనే అదైనా బయటికి వచ్చింది.

ఆరోజులలో మనపుస్తకాలకంటె పరదేశుల గ్రంథాలే ఎక్కువగా చదువుతూ వుండేవాణ్ణి. నిజానికి చెప్పుకోదగిన పుస్తకాలు మనవి ఏవీ ప్రకటన కాలేదు. ప్రాచీనాంధ్రవాఙ్మయ మంతా పట్టుపట్టి కూర్చుంటే సమగ్రంగా చదవవచ్చు సంవత్సరన్నరలో. మనదృష్టి విశాలం కావలె నంటే, మనగ్రంథకర్తలు ఎక్కువ వ్యుత్పన్నులు కావలెనంటే, అనేకసారస్వతాలు అవలోడనం చేయవలెనని వుంటుంది.

ఒకఆంధ్రంగాని ఒకసంస్కృతంగాని, సంస్కృత - ఆంధ్రాలు రెండేగాని చదివితే వ్యుత్పన్నత సమగ్రం గాదు. ఒక దేశీయభాషా ఒకపరభాషాకూడా అభ్యసించడం అవసరం. జపాన్ దేశంలో బి. యే. డిగ్రీ పుచ్చుకోవలెనంటే పరభాషలైన రష్యన్, జర్మన్, ఫ్రెంచ్, ఇంగ్లీషు భాషలలో ఏవో రెండు అభ్యసించి పరీక్షలో ఉత్తీర్ణుడు కావాలి. స్వభాష సమగ్రంగా తెలుసుకొని తక్కిన వేవీ గ్రహించకుండా వుంటే గ్రంథకర్త జట్కాగుర్రంలాగ అవుతాడు.

ఒకసారి గుంటూరు వెళ్ళినప్పుడు అప్రయత్నంగా అక్కడ మిషన్ కాలేజిలో ఉద్యోగం దొరికింది. సంస్కృతం చెప్పడం నాకు సంతోషం. కాని, కాలేజవారు నన్ను తెలుగుపండితుడుగా వేసుకున్నారు. అక్కడ వున్నరోజుల్లో బహువిధాల నేను వృద్ధి పొందాను. ఇతరులకు ఏదైనా నేర్పుతున్నప్పుడు నిజంగా నేర్చుకునేవాడు చెప్పేవాడే. అంటే, అదివరకు ఉపదేష్టమనస్సులో పొగమంచువలె ఉండేభావాలు సుస్పష్టం అవుతాయి. అననుభూతమైనవిషయాలు అనుభూతిలోకి వస్తాయి. యువకులయినవిద్యార్థులతో కలసిమెలసి వుంటూంటే తలపులలో తారుణ్యం, వర్తనలో మార్దవము, అలవడుతవి. అమాయికులయినవిద్యార్థులంతా ఉపాధ్యాయుణ్ణి మహాప్రీతితో చూస్తూవుంటారు. వాళ్ళ కోమలహృదయాలలో వ్యుత్పన్నతాబీజాలు చల్లడం చాలా సులభం.

కొన్నాళ్ళు ఇలా గడుస్తూ వుండగా నామిత్రులు అక్కిరాజు ఉమాకాంతంగారు ఒకనాడు గుంటూరు వచ్చినట్టు విని చూడ్డానికి వెళ్ళాను. ఆయన సంస్కృతాంధ్రాలలో బాగా కృషి చేశాడు. శ్రీనాథుని పల్నాటివీరచరిత్ర సంపాదించి ప్రకటించి ప్రసిద్ధి చెందాడు. కొంతకాలం ఆంధ్రసాహిత్య పరిషత్తుకు కార్యకర్తగా పనిచేశాడు. త్రిలింగ పత్రికకు కొన్నాళ్లు సంపాదకుడుగా వున్నాడు. కలకత్తాలో మహామహోపాధ్యాయ ప్రమథనాథ, తర్కభూషణ మొదలయిన మహావిద్వాంసులవద్ద దర్శనాలు చదువుకున్నాడు. మే మిద్దరమూ చిన్నతనంలో, కాలేజీలో మూడేళ్ళు సహాధ్యాయులము. కథలు వ్రాసినట్టు ఆయనతో ఇష్టాగోష్ఠిలో అన్నాను. ఒకకథ చదివి వినిపించాను. విని ఆయన 'బాగున్నది కాని వాడుకభాషలో వుంటే ఎక్కువబాగుండేది' అన్నారు. నమ్మడానికి వీల్లేనిమార్పు ఏదో నాలో కలిగింది. ఆక్షణంలో కంటికి కప్పి వున్నపొరలు వెంటనే రాలిపోయినట్టయింది. 'మీరు విద్వాంసులుకదా, ఘాటుగా వుండేపుస్తకాలు వ్రాశారుకదా, వాడుక తెనుగులో కథలూ గట్రా వ్రాయాలని మీకెందుకు బుద్ధిబుట్టింది?' అన్నాను. ఆయన యిలా చెప్పారు: ఒకపర్యాయం గురజాడ అప్పారావు పంతులుగారు మదరాసు వచ్చినప్పుడు, ఆయనతో నేను నిష్ఠూరంగా మాట్లాడాను—

మీరు భాష పాడుచేస్తున్నారని. అప్పారావుగారు మహాశాంతంగా, 'జయంతి రామయ్యపంతులుగారితో ఎంతచెప్పినా లాభం లేకపోయింది. మీ కింకా చిన్న తనం,' అన్నారు. దానితో నాలో మార్పు వచ్చింది. అప్పట్నుంచీ వాడుకభాష లోతప్ప వ్రాయ నని నిశ్చయం చేసుకున్నాను. గ్రాంధికభాష అంటే నాకు చాలా తలనొప్పి' అన్నారు. ఆవేళ మాయిద్దరికీ జరిగినసంభాషణవల్ల తెలుగు గద్యరచనలో 'ఇఁకిలాబ్' వచ్చింది.

ఆకాలంలో వీరరాఘవస్వామి, శివకామేశ్వరరావుగారు నేనూ ఇరుగుపొరుగున వుండేవాళ్ళం. నోరి నరసింహశాస్త్రి కొత్తపేటనుంచి ప్రతిరోజూ వచ్చి మమ్మల్ని కలుసుకుంటూ వుండేవాడు. కామేశ్వరరావు 'అధఃపతనము' అనే నవల గొడ్డుగ్రాంధికభాషలో వ్రాస్తూవుండేవాడు. నాలో వచ్చినమార్పు ఆయ నకు అంగీకారం కాలేదు. కలకత్తా కాంగ్రెసునుంచి అప్పుడే వచ్చిన 'స్వామి' గారికికూడా రుచించినట్లు లేదు. నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహా రావు, పెద్దిభొట్ల రామచంద్రరావు, చామర్తి రాజశేఖరరావు, మొదలయిన మిత్రులు ఇష్టపడ్డారు. స్నేహితులతో తరుచు భాషాచర్చ జరుగుతూ వుండేది.

ఉమాకాంతంగారికి జబ్బుచేసినప్పుడు "వీలునామా" వ్రాస్తూ వాడుకభాష అమలులోకి తీసుకురావలసిం దనీ, గ్రంధకర్తలచేత అదే ఉపయోగం చేయించ వలసిం దనీ నాపేర ఉద్బోధనవాక్యాలు అందులో చేర్చారు. తరవాత దైవాను గ్రహంవల్ల ఆయనకు ఆరోగ్యం కలిగింది. ఈసంగతి నాకు తెలిసినప్పుడు నేను చాలా సంతోషించి ఆయనకోరిక అమలులో పెట్టడానికి పూనుకున్నాను. అది వరలో గ్రాంధికభాష శల్యగతం కావడంచేత వెంటనే వాడుకభాషలో వ్రా యడం కష్ట మనిపించింది. అయినా ఆరోజుల్లో ఎక్కువ పద్యరచన చేస్తూవుండే వాణ్ణి. ఘాటుమసాలా వస్తువులకు మరిగిననాలిక, మామూలు స్వాదువస్తువుల రుచి గ్రహించలేదు. ఉపవాసం చేస్తేనేగాని ఉన్నదోషం పోయి జిహ్వకు సహజశక్తి కలగదు. అలాగే నేనుకూడా కొంతకాలం గ్రంధరచనకు ఉప వాసవ్రతం ఉపదేశించాను.

తర్వాత కొద్దిరోజులకు పెద్దాపురంలో వున్న దీక్షితులుగారిని చూడ్డానికి వెళ్ళి నప్పుడు ఆయనకూడా యీమార్పుకు చాలా సంతోషించి గురజాడ అప్పా రాయకవి రచనలన్నీ నాకు వినిపించి, ప్రోత్సహించారు. అదివరలో కృతక భాషలో వ్రాసే దీక్షితులుగారు వాడుకభాష వెంటనే అంగీకరించినందుకు చాలా సంతోషం కలిగింది.

మరికొన్నిమాసాలకు గిడుగు రామమూర్తి పంతులుగారు గుంటూరు ప్రచారం కోసం వచ్చి, వారిశిష్యులైన ప్రొఫెసర్ కాళ్ళకూరి సూర్యనారాయణగారి ఇంటిలో దిగారు. సూర్యనారాయణగారు నాకు మిత్రులు కావడంచేత పంతులు గారితో పరిచయభాగ్యం వేగిరం కలిగింది. పంతులుగారు మహోపన్యాసాలు చేసి గుంటూరునగరంలో కొంతమంది విద్వాంసులను, గ్రంథకర్తలను తమవైపు తిప్పుకున్నారు. అప్పటినుంచీ చాలామందికి వాడుకభాషమీద ద్వేషం తొలగి పోవడమే కాకుండా అభిమానంకూడా కలిగిం దని తోచింది. పంతులుగారు అడి గినప్రశ్నల కెల్లా సమాధానం చెప్పి, గ్రంథనిదర్శనాలు చూపించి, ఇతరులను నిర్వాక్కులను చేసేవారు.

ఆరోజుల్లో నా కొకటి తోచింది. వాదబలంచేత పరపక్షనిర్జయం చేస్తే అవ తలవాళ్ళు తాత్కాలికంగా నోరెత్తకపోయినా, మనస్సులోమాత్రం కొద్దిగా కించపెట్టుకుంటూ వుంటారు. పంతులుగారిసమక్షంలో ప్రయోగాదు లన్నీ వొప్పుకున్నా తరువాత యథాప్రకారంగా గ్రాంథికపద్ధతులకే వొచ్చారు కొందరు.వాదంచేసి మనుష్యులను మనవేపు తిప్పుకోడంకన్న మృదువుగా వాడుక భాషలో వచనము వ్రాయడం fashion చేస్తే అశ్రమంగా సాహిత్యం వృద్ధి చెయ్యవచ్చునని నాకు తట్టింది.

సమితిసభ్యులు వ్యుత్పన్నతకోసం వివిధభాషలు నేర్చుకోవడం ఉచిత మని నిశ్చయించాము. అదివరలోనే వీరరాఘవస్వామి, పూర్ణశర్మ, నేను వంగభాషా గ్రంథాలు చదువుతూ వుండేవాళ్ళము. నరసింహశాస్త్రి కన్నడమూ, స్వామి, నేనూ మహారాష్ట్రమూ చదవడం ప్రారంభించాము. కొందరుసభ్యులకు సంస్కృ తం వచ్చును. నేను ఆసంవత్సరం (1918) సాంఖ్యము, అలంకారశాస్త్రము, గట్టిగా చదివేవాణ్ణి. ఆచార్యశంకరుల కావ్యసముచ్చయమూ, భర్తృహరిసుభాషి తం, గీతగోవిందం తరుచు తిరగవేస్తూ వుండేవాణ్ణి.

మిషన్ కళాశాలలో చాలాగ్రంథజాలం వున్నది. పూర్వము Addison మహా శయుడు Detroit పురపుస్తకభాండారంలో వున్నసమస్తగ్రంథాలూ, ఒకటీ విడవకుండా ప్రతిజ్ఞచేసి చదివినట్టు ఎక్కడో చదివాను. నాక్కూడా అటువంటి పెఱ్ఱి పుట్టింది. కావ్య, నాటక, కథా, విమర్శ, మహాపురుషజీవిత, భాషాతత్త్వ, గ్రంథసముదాయము యావత్తూ చదివాను. మడతలు విప్పకుండా, మంచిబైండు ధరించి, అందమైనజాకెట్లు వేసుకొన్న అనేక కావ్యకన్యకలకు కన్నెచెర నేను విడిపించాను. మాఅన్నగారు గంగాధరశాస్త్రిగారు - తర్వాత జగద్గురు పరమ

హంస పరివ్రాజకాచార్య శ్రీ పరానందభారతీ స్వామివారు — నావిద్యాపిశాచి గమనించి 'ఎందుకు ఇదంతా ? అధ్యాత్మచింత మనబోటివాళ్ళకు ఉండతగ్గది. ఉపనిషత్తులు మొదలయినవి చదివి బ్రహ్మజిజ్ఞాస చెయ్యి' అని ఆదేశించారు. వెంటనే ఉత్తరమీమాంసాశాస్త్రం అధ్యయనం చెయ్యకపోయినా పుదయం భగవద్గీత, రాత్రిళ్ళు ఉపనిషత్తులూ, చదువుతూ వుండేవాణ్ణి. కాశీ కృష్ణాచార్యులుగారి సంస్కృతసమాజంలో చేరి గీర్వాణవాణిలో ధారాళంగా మాట్లాడుతూ వుండేవాణ్ణి. ఆచార్యులవారు చిన్న చిన్న వృత్తాలుకూడా మాచేత పలికించేవారు. ఆయనవుద్దేశం యావద్భారతదేశీయులు సంస్కృతంలో సంభాషించాలని. అది సంభావ్యవిషయం కాదని వారి కెన్నోసారులు చెప్పాను. ఒకవేళ సంస్కృతం ఎక్కువవుంది మాట్లాడినా, దాని స్వరూపం చెడిపోయి Monkish Latin వలె అయిపోతుం దనీ, అలా కాకపోతే, ఆంధ్రసంస్కృతం, అరవసంస్కృతం, మహారాష్ట్రసంస్కృతం — ఈవిధంగా అపభ్రంశ మయిపోతుం దనీ నాభావం.

ఆసంవత్సరం కొత్తస్నేహితులు ఆరంభించారు. ముక్కపాటి నరసింహశాస్త్రిగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, బసవరాజు అప్పారావుగారు మొదలైనవారితో మైత్రి కలిగింది. ఈముగ్గురికీ వాడుకభాష అంటే కొంత యిష్టం. నరసింహశాస్త్రిగారు తర్వాత కొంతకాలానికి తమగ్రంథా లన్నీ వాడుకభాషలో వ్రాయడం ప్రారంభించారు. అబ్బూరి రామకృష్ణారావుగారి "ఊహాగానము — పూర్వప్రేమ" అనే చిన్న పద్యకావ్యసంపుటి ఆరోజుల్లోనే బయటికి వచ్చింది. మార్తి వెంకటరామయ్యగారితో స్నేహం కుదిరి మే మిద్దరమూ కలిసి సిద్ధాంతకౌముది చదువుతూ వుండేవాళ్ళము.

నందిరాజు బాపన్నపంతులుగారు చాలా వింతమనిషి. ఆయన మైసూరు ప్రాంతంలో డాక్టరుగా వుండి, ఉద్యోగం మానేసినతరవాత గుంటూరులో వుండేవారు. ఆయనకు ఎవరితోనూ పడేది కాదు. అదేం చిత్రమో కాని నామీద ఆయనకు అనురాగం కలిగింది. సాహిత్యంలోకన్న సంస్కృతవ్యాకరణంలో ఆయనకు గాఢప్రవేశం. అందులోనూ విశేషించి— చాలామంది సంస్కృతవిద్యావంతులకన్న ఆయనకు ధాతుపుష్టి హెచ్చు. ఏవిధంగా కత్తు కలిసిందో కాని, ఒక్కనాడుకూడా పేచీ యేమీ రాకుండా ఇద్దరమూ గాఢానురాగంతో ప్రవర్తించేవాళ్ళము. బాపన్నగారివల్ల నాకు వైదికవాఙ్మయంమీద అభిమానం ఏర్పడ్డది. పఠనానికి ఉపయోగించే వైదికవ్యాకరణాది గ్రంథాలు ఆయన తెచ్చియివ్వడమే కాకుండా తరుచుగా ప్రోత్సహిస్తూ వుండేవాడు. అసలు మా మాతామహులు షడంగములతో వేదాధ్యయనం చేసి జటావల్లభులు ఘనాపాఠులు

అయినవాళ్ళు. ఆరక్తస్పర్శవల్ల వేదాభిమానం వున్నా, వేదార్థపరిజ్ఞానం మాత్రం బాపన్నగారివల్లనే నాకు కలిగిం దని కృతజ్ఞతాపూర్వకంగా చెప్తు తున్నాను. భాషాతత్త్వం గ్రహించడానికి ప్రాచీనగ్రంథాలలో మహాభాష్యం చాలా అనువైనది. నవాహ్నికభాగం ఆజుల్లోనే చదవడం తటస్థించింది.

వైదికసంస్కృతం, లౌకికసంస్కృతం, ప్రాకృతం, పాలీ, భాషలు సక్రమంగా గ్రహిస్తేనేగాని, భాషాతత్త్వం అవగతం కాదని, ప్రాకృతం పాలీకూడా నేర్చు కోవడం మొదలుపెట్టాను. పాలి అనేభాష ఒకటి ఉన్నదని ఆంధ్రదేశంలో అనేకమంది సంస్కృతవిద్వాంసులకు తెలియనే తెలియదు. వైదికసంస్కృతానికీ ప్రాకృతానికీ, మధ్యరూపం పాలి అని భాషాతత్త్వవేత్తలు కొందరు అన్నారు. త్రిపిటకాలు, బౌద్ధధర్మగ్రంథసంచయమూ పాలిభాషలో ఉండడంచేత మన శ్రోత్రియవిద్వాంసులకు అభిమానం వుండకపోవచ్చును. ప్రాకృతంలో చేసినంత కృషి పాలిభాషలో చెయ్యలేకపోయినాను.

కళాశాలభాండారంలో 'Sacred Books of the East' సంపుటా లన్నీ వుండేవి. భాషాతత్త్వశాఖలో Bopp, Roth, Whitney, Sayce, Max-Muller, Macdonell మొదలయిన మహావిద్వాంసులగ్రంథాలు వైదిక, లౌకిక సంస్కృత వాఙ్మయచరిత్రలు, వ్యాకరణాలు ఇత్యాదు లన్నీ నాకు చాలా ఉపకరించినవి. ఇవేకాకుండా, పురాతత్త్వపరిశోధనలు ప్రకటిస్తూవుండే పత్రికలుకూడా ఉపయోగించినవి.

భాషతోనే తంటాలుపడక, భావంకోసంకూడా పాటుపడుతూ వుండేవాణ్ణి. జయంతి సత్యనారాయణ మూర్తిగారితో మైత్రిఅయినదగ్గరనుంచీ Theistic Endeavour Library పుస్తకాలు చదివే లాభం కలిగింది. Maurice, Maeterlinck, Bernard Shaw, మొదలైనవారి నాటకాలూ, General Philosophy మీద పుస్తకాలూ, ఆయన ఇస్తూ వుండేవారు. అంతేకాకుండా పది మంది స్నేహితులను చేర్చి 'Reading Circle' అని పెట్టి, చదివినపుస్తకాల మీద చర్చ జరిపిస్తూ వుండేవారు. పాశ్చాత్యతత్త్వశాస్త్రవిషయాలు, Sociology విషయాలు ఆయనవల్ల వింటూ వుండేవాణ్ణి.

కొక్కుపాటి నరసింహశాస్త్రిగారు England నుంచి వచ్చేటప్పుడు చాలా గ్రంథజాలం తెచ్చారు. అందులో Moliere, Mazzini సంపుటాలు, Goethe Wilde నాటకాలు, చాలామంది చిత్రకారుల Drawings మొదలయినవి నా కిచ్చారు. ఇప్పటికీ నాకు Moliere నాటకాలు చాలాయిష్టం. Maeterlinck

ప్రభావం ఇప్పటికీ తగ్గలేదు. **Norway** నాటకకర్త లంటేకూడా అభిమానమే. ఇవన్నీ చదువుతూ ఉన్నప్పుడు మనగ్రంథకర్తలు ఎంత వెనకబడివున్నారో, ఎంత కృషిచేయవలసి వున్నారో రంగస్థలం ఎంత మార్చాలో, బోధపడ్డది. మోలీర్, ఇబ్సెన్, మేతర్లింక్ మొదలయినవారి నాటకాలు మిత్రులలో ప్రచారం చేశాను.

మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారి మైత్రి అంతకుముందే లభ్యమైంది. శాస్త్రిగారు రాజమహేంద్రవరములో ట్రెయినింగు అవుతున్నారు. మా సంభాషణలో భాషాచర్చ వచ్చింది. ఆయన వాడుకభాష మంచి దని అన్నారు. వెనక ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రికలో గిడుగు రామమూర్తిపంతులుగారి "ప్రాదెనుగు గమ్మ" మీద "అంపగమి" వేసినశాస్త్రిగారు ఇలా మారినందుకు నాకు చాలా సంతోష మైంది. అప్పుడు ఆయన చెప్పినసంగతులలో ఒకటి యిప్పటికీ బాగా జ్ఞాపక మున్నది. అచ్చుపడ్డ ప్రాచీనాంధ్ర గ్రంథము ఏదీ నేను నమ్మను అని శాస్త్రిగా రంటే, ఎందుచేత అన్నాను. దానికి బదులు వారు ఇలా చెప్పారు:- "మనవిద్వాంసులకు దిద్దడ మంటే మహాసరదా. చిన్నయసూరిబాలవ్యాకరణం కాలతబద్ధగా పెట్టుకుని వా రీపని చేస్తారు. న్యాయానికి మాతృకలు అనేకము సేకరించి లేఖకులదోషా లేవో విసర్జించి యథామాతృకంగా గ్రంధము అచ్చు వేయడము పరిషత్తుధర్మము."

ఆసంవత్సరం గ్రీకువాఙ్మయము మీద అభిమానము పుట్టింది. తర్జుమాలలో **Homer** కావ్యాలు, **Aeschylus, Sophocles, Euripedes, Aristophanes,** నాటకాలు గ్రీకువాఙ్మయచరిత్రతోసహా చదవడం సంభవించినది. గ్రీకుభాషకూడా నేర్చుకుందా మనుకొన్నాను. 1908 లో **Mark Hunter** దొరగారికి ఉత్తరం వ్రాస్తూ నేను విద్యార్థిననీ **Greek, Latin** భాషలు నేర్చుకోవలె నని అభిలాష అనీ, పుస్తకాలు మొదలైనవి సూచిస్తూ సలహా యివ్వవలసినది అనీ ప్రార్థిస్తే ఆయన జవాబు వ్రాయలేదు. మనదేశానికి వచ్చేటప్పటికి ఈతెల్లవాళ్ళకు తలతిరుగుడు హెచ్చు! మహావిద్వాంసుడైన **Max Muller** దొరగారికి ఎవరో సలహాకోసం వ్రాస్తే ఆయన సక్రమమైనఉపదేశం యిచ్చి పుస్తకా లన్నీ సూచించాడట. విద్వాంసుడికీ, ఉద్యోగికీ ఉండే తేడా యిది. గ్రీకు వాఙ్మయము సమగ్రంగా ఇప్పుడు లభించకపోయినా, ఉన్నంతమట్టుకు రత్నఖండమువంటి దని భావించవచ్చు. చివరకు గ్రీకు అభ్యసించలేదు.

౬

తరువాతసంవత్సరం కొత్తమైత్రి లభించింది. దానివల్ల క్రమక్రమంగా నామనస్సులో మంచిమార్పు జరిగింది. పోతుకూచి శ్రీరామమూర్తిగారు ఇంగ్లండునుంచి వచ్చి తెనాలిలో ఉండేవారు. అప్పు డాయనఆకారము Lloyd George ని జ్ఞప్తికి తెచ్చేది. అప్పట్లో రామమూర్తిగారు మాలికారూపంలో సిగరెట్లు కాలుస్తూ ఉండేవారు. ఇప్పుడు చూస్తే ఇంగ్లీ షంటే ఏమిటో తెలియకుండా శుద్ధశ్రోత్రియంగా ఉన్నశివావతారం! ఆయనవాక్కులవల్ల అట్టే మార్పు రాలేదు గాని, ఆయనదగ్గర ఉన్నగ్రంథజాలంవల్ల మట్టుకు నాలో గొప్పపరివర్తనం కలిగింది. తత్త్వశాస్త్రంమీద అనేకం, హిందూ, చీనా, జపాన్ శిల్పశాస్త్రంమీద అనేకమూ ఉన్నవి. చదువుకోడానికి అడిగిన వన్నీ యిచ్చారు. మన శిల్పశాస్త్రంలో నాకు అప్పటికి తగినఅభిమానమూ లేదు; అభినివేశమూ లేదు. ఇవి చదువుతుంటే అదివరలో నా కున్నభ్రమ లన్నీ పోయినవి. భారతీయకళారహస్యాన్నీ, సంపత్తినీ కొంతవరకు గ్రహించగలిగాను. అసలు ఆసియాశిల్పహృదయం కించిత్తయినా అవగతము కావడానికి కారణము Okakura Kakuzo రచించిన Ideals of the East అనేపుస్తకం. అందులో ఒకచిత్రపటమైనా లేదు. ఐరోపాకళాహృదయం తెలియడానికి కారణమైన Clive Bell గ్రంథము Art అనేది. అందులోనూ ఒక్కచిత్రపటమైనా లేదు. పటాలు లేనిశిల్పగ్రంథాలవల్ల ఏమో తెలిసిం దంటే జనసామాన్యము నమ్మలేనిమాట ; కాని నేను పునర్జన్మ ఎత్తినట్టైంది. Binyon, Fennelosa మొదలైనవారి శిల్పశాస్త్రగ్రంథాలు, జపాన్, చైనాకళాస్వరూపం వివరించినవి.

దౌర్బల్య మంటే నాకు సరిపడదు ; కాని మానవమాత్రులం కావడంచేత దౌర్బల్యలక్షణాలు అప్పుడప్పుడు వస్తూనే ఉంటవి. Friedriche Nieztsche గ్రంథాలు చదివితే దౌర్బల్యం పోవడమేకాక జబర్దస్తీకూడా హెచ్చుతుంది. ఆ జర్మన్‌తత్త్వవేత్త పురుషోత్తమయోగం నమ్మినవాడు. భగవద్గీతలో పురుషోత్తమత్వానికీ ఇతని suparman సిద్ధాంతానికీ తేడా ఉన్నది. 'Slave morality and Master Morality' అనే విభాగం చాలా గొప్పది. ఇప్పటికీ ఎప్పుడైనా దౌర్బల్యం వస్తూఉంటే ఆతత్త్వవేత్త రచించిన Thus spake Zarathustra చదివితే సాహసం విజృంభిస్తుంది.

మామూలుగా దొరికే ఇంగ్లీషుకవుల సంపుటాలుకాక రామమూర్తిగారి గ్రంథసముదాయంలో Yeats, "A. E." పుస్తకాలు దొరకినవి. ఆకవులు

చూపేది క్రొత్తప్రపంచం. Yeats వ్యాసాలు అతీంద్రియవిషయాలకు దారి తీసేటట్టు ఉండేవి. ఇంగ్లండులో ఉన్నరోజుల్లో నరసింహశాస్త్రిగారూ, రామమూర్తిగారూ, Yeats తోను Bernard shaw తోనూ మాట్లాడినట్లు చెప్పారు. Yeats కవి వచ్చి వీళ్ళసంఘంవారికి ఉపన్యాసం ఇచ్చాడట. ఈసంగతి తెలిసి Yeats మీదా, అతనిగ్రంథాలమీదా నాకు అభిమానం హెచ్చింది.

దృష్టిదోషం పోవడానికి సహాయపడ్డ మరొకగ్రంథం Professor Butcher సంపాదించిన Aristotle's Poetics. జగత్తులో మహోత్తమగ్రంథాలలో ఇది ఒకటి అని అందరికీ తెలిసిందే. Butcher తర్జుమా చేసినపద్ధతి, చివర చేర్చినవ్యాసాలు గ్రీకుసాహిత్యాచార్యునిహృదయం సుస్పష్టం చేస్తవి. అడుగడుగుకూ Foot-note యిచ్చి బాధ పెట్టకుండా పుస్తకంలో సర్వవిషయాలు స్పృశిస్తూ స్వతంత్రవ్యాసాలుగా ఆయన చివర చేర్చినవి అద్వితీయము. ఆ మధ్య విద్వాంసు లెవరో palimpsest పరీక్ష చేస్తూ Aristotle చెప్పింది Imitation of Nature కాదనీ Interpretation అనీ తేల్చారు. దీనివల్ల గ్రీకుతత్త్వవేత్తమతములో లోపములేకుండా అయింది. కొన్నిగొప్ప అలంకారగ్రంథాలు సంపూర్ణం కానేలేదు. Poetics, Longinus on the Sublime, మనకావ్యప్రకాశము అంతే. అయితే కావ్యప్రకాశములో చివర ఉల్లాసము మరొకఅలంకారికుడు పూర్తిచేశాడు.

జ్ఞానోపార్జనలో పక్షపాతము, అసమగ్రదృష్టి అనుచితాలు ; సమ్యగ్దర్శనము సముపార్జించవలసినది. కళాప్రపంచంలో గతిభేదా లనేకం ఉన్నవి. పరస్పర విరుద్ధంగానూ ఆభాసగానూ ఉండేవిధానాలన్నీ సమరసం చేసి సహృదయులకు సమ్యగ్దర్శనము ప్రసాదించింది మనవేదాంతులు, తదనుయాయులైన అలంకారికులూ. నాకు తెలిసినంతలో పాశ్చాత్యరసికులలో Benedetto Croce ది ఉత్తమమతం. ఆ ఇటలీ అలంకారికునిది Expressionist Theory. ఈమధ్య Gentile అనే మరో అలంకారికుడు మతభేద మేమో చూపించాడట. అయినప్పటికీ Aestheic సిద్ధాంతము గొప్ప దనేటందుకు సంశయం లేదు. ఆగ్రంథం చదవడంవల్ల నాకు ఒకవిధమైనప్రసన్నత, దృష్టివైశాల్యం కలిగినట్టు భావించాను. అటువంటిది మనభాషలో వుంటే బాగుండును. దాన్ని తర్జుమా చేయడం అసాధ్యమైనపని. ఎవరైనా దాన్ని సంగ్రహించి స్వంతమాటలతో వ్రాస్తే ఉపకారం చేసినవా రవుతారు.

చదివినగ్రంథాలలో మరోటి Bosanquet విరచితమైన History of Aesthetic. ఐరోపాలో అనాదినుంచీ ఉన్న రససిద్ధాంతాలూ, విశేషించి,

జర్మన్ ఆలంకారికుల వివిధమతాలూ క్రమానుసారంగా అందులో వివరించి వున్నవి. Latin జాతుల దృష్టికీ Tuton జాతుల దృష్టికీ కావ్యాదికళలలో కొంత భేదం వున్నది. Bosanquet ఈ గ్రంథం Tuton దృష్టి ప్రధానంగా వ్రాశాడు. ఈగ్రంథవిషయాలు నామనస్సులో బాగా నాటుకున్నవి.

ఇంగ్లీషువిమర్శకులలో ఆరోజుల్లో నాకు బాగానచ్చినవారు వీరు: **Coleridge, Matthew Arnold, Walter Bagehot, Bradley, Quiller-Couch, Saintsbury**- ఈవిమర్శకుల రచనల్లో పరస్పరవైరుధ్యం వున్నప్పటికీ, ఏదో విధంగా మనస్సు సమాధానపరుచుకున్నాను. సరిపోల్చి చూస్తే, మన ఆలంకారికులకూ, వీరికీ చాలావిషయాలలో సాదృశ్యం వున్నది. తూర్పుపడమరలు సమన్వయించినమీదట సమ్యక్‌దృష్టి కలిగి విశ్వజనీనసాహిత్యం సక్రమంగా గ్రహించి ఆనందించగలుగుతాము.

గ్రీకువాఙ్మయము చదువుతూ వున్నరోజుల్లో నోరి నరసింహశాస్త్రి అందులో కథావస్తువులు కొన్ని స్వీకరించి ఖండకావ్యాలు చేశాడు. తరువాత అవి "గీతమాలిక" అనేసంపుటిలో నిబద్ధం అయినవి. నాకంటె అతను గ్రీకు Spirit బాగా గ్రహించాడేమో అనిపించింది. నా కిప్పటికీ ఒకకోరిక వుంది : గ్రీకు నాటకాలు పద్యరూపంగా తెలుగులోకి ఎవరైనా మారిస్తే చూతామని. మన విద్వాంసులు కొందరు సంస్కృతనాటకం రూపకరచనలో పరాకాష్ఠకు వెళ్లిందని అంటున్నారు. కళాదృష్టితో నిష్పక్షపాతంగా చూస్తే గ్రీకునాటకాలే ఎక్కువ బందోబస్తుగా వ్రాసినవేమో అనిపిస్తుంది.

పోతుకూచి శ్రీరామమూర్తిగారే పాశ్చాత్యతత్త్వవేత్తల రచనలమీద నాకు అభిమానం కలిగించారు. బహుశా మరుసటి సంవత్సరం **Bradley, Bosanquet, Haldane, Royce, Sorley** మొదలయినవారి పుస్తకాలు నాచేత చదివించారు. **Gifford Lectures** ఇచ్చినతత్త్వవేత్తల పుస్తకాలు కూడా కొన్ని తిరగేశాను. **Sexual Science** లోనూ లలితకళలలోనూ, సాహిత్యవిమర్శలోనూ, దర్శనాదులలోనూ అభినివేశము ఏర్పడ్డది. చిత్తప్రసాదనం కలిగి స్థైర్యం అలవడ్డది. సంశయాపన్నమయినవిషయాలనేకం చిక్కులు విడిపోయి సుసంగతం అయినవి.

౧౦

ఈప్రకారంగా వివిధవిషయాలలో వ్యుత్పన్నతకోసం కృషిచేస్తూ వుండగా 1919 అవసానం కావచ్చింది. కొమర్రాజు హనుమంతరావు సాహితీసమితిని సుస్థిరం చేయవలసిం దనీ, సాహితీ పత్రికకు అయ్యేవ్యయ మంతా తాను భరిస్తా ననీ చెప్పినాడు. మిత్రు లందరితో సంప్రతించి పత్రిక నడపడానికి ఏర్పా ట్లన్నీ చేశాను.

పత్రికలో ఏయేవిషయాలు ప్రకటించా లని చర్చ వచ్చింది. అప్పట్లో మంచి కథలుగాని, నవీనవిధానంలో రచించినకావ్యాలుగాని, సరసము లైనవ్యాసాలు గాని ఆధునికసాహిత్యంలో అట్టే లే వనే ఉద్దేశంతో వీటికి ప్రాధాన్యం ఇవ్వా లని నిర్ధారణ అయింది.

భాష ఎటువంటిది ఉపయోగించవలె ననేమీమాంస జరిగింది. నా పట్టుదల మీద వాడుకభాష వాడడానికి సభ్యులు అంగీకరించారు. కొద్దిమందిమాత్రం తూష్ణీంభావం వహించారు. ఇద్దరిముగ్గురితో మైత్రి కొద్దిగా చెడుతుం దేమో అని భయపడ్డాను. ఇప్పుడు వాడుకభాషలో వచనగ్రంథాలు వ్రాయడం అనేకు లకు లీలాప్రాయం అయిపోయింది. 1919 లో అస్మదాదులకు అవరోధం హెచ్చుగా వుండేది.

సాహితీపత్రిక మొదటిసంచిక 1920 లో బయటికి వచ్చింది. చేతా మను కున్నంత అందంగా చెయ్యలేకపోయినాము. చివరకు మాసపత్రికగానైనా ప్రారంభించ లేదు. ఆపత్రికసంగతీ, మామిత్రవర్గవృత్తాంతాలూ, సాహితీసమితి చరిత్ర వ్రాసేవారికి విడిచిపెట్టుతున్నాను.

అసలు ఆంధ్రభాషకు స్థితి ఏర్పడి **standard** కూడా ఉండగా ఈవింత మార్గంలో వెళ్ళడం ఎందుకని కొంతమంది అన్నారు. అదివరలో మనకు ఉన్న వ్యాకరణగ్రంథాలన్నీ పద్యభాష నిరూపించడానికే గాని వచనభాషకోసం కాదని ఏమాత్రం సమీక్షాదృష్టి వున్నవారికైనా గోచరిస్తుంది. అయితే కావ్యా లలో పద్యాలమధ్య వున్నవచనంగతి ఏమని సంశయం కలగవచ్చు. కథాసంధి కోసం, సామాన్యవిషయ ప్రతిపాదనకోసం వుపయోగించేభాష ఛందోబద్ధం చేయడం ఇష్టంలేక వెనకటికవులు గద్యరూపంగా వుంచారు. అయితే ఈ భాషకూ, పద్యభాషకూ విశేషతారతమ్యం వుంటే, ఎగుడుదిగుడుగా వుంటుం

దనీ, సమత్వం సమకూరదనీ అపరిష్కారంగా చేశారు. కాబట్టి ఆభాష వచనానికి ప్రమాణంగా ఎంచుకోగూడదు. వ్యాకరణమో సమగ్రంగా లేదు. చిన్నయ సూరి వ్యాకరణం నిష్కారణంగా ప్రమాణగ్రంథం అయిపోయింది. దాన్నిబట్టి భాష యావత్తూ దిద్దుతామంటారు ప్రాచీనపద్ధతిలో తయారైనవిద్వాంసులు. ముందుగా పుట్టడంకూడా ప్రామాణ్యానికి హేతువైతే అటువంటివారి అదృష్టాన్నిగురించి జ్యోతిష్కులు చెప్పవలసిందే!

ఎంతగొప్ప వైయాకరణి అయినా ఒకడు భాషకు సమగ్రమైనవ్యాకరణం చెయ్యలేడు. వృద్ధికావడం మానివేసిన సంస్కృతభాషకు వ్యాకరణం అనుశాసించిన భగవాన్ పాణినిమహర్షి అతఃపూర్వం అనేకమంది వ్యాకృతులను స్వీకరించి అష్టాధ్యాయి చేస్తే అదికూడా సమగ్రం కాలేదు. అటువంటిస్థితిలో సామాన్యవిద్వాంసు డెవరో జీవద్భాషకు ప్రమాణభూత మైన అనుశాసనం చేశాడంటే అస్మదాదులం అంగీకరించలేము. వాఙ్మయంలో ఉన్నగ్రంథజాలమంతా ప్రచురం కాలేదు. అయినదాన్నికూడా ఒకడు పరిశీలించలేడు. గ్రహణశక్తి చాలకకాని, భ్రమప్రమాదాదులవల్లగాని, అనేకశబ్దరూపాలు ప్రత్యక్షం కావు.

భాషాభివృద్ధి అంటూ చాలామంది చిలకపలుకులు పలుకుతున్నారు. నిజంగా వృద్ధి కోరినట్టయితే వ్యవహారంలో వున్నభాషను స్వీకరించి తీరాలి. ఎంత మహాకవైనా భాష యావత్తూ తనగ్రంథాలలో ఇముడ్చుకోలేడు. వెనకటికవులు ఉపయోగించినభాష ఆకాలంలో వారికి తెలిసిందే. గ్రాంథికశబ్దాలుకూడా మొదట మనుష్యులనోట వచ్చినవే కాని ఆకాశంనుంచి ఊడిపడ్డవి కావు! అంతకంటె ఎక్కువభాష మనం వాడకూడ దంటే భాషాభివృద్ధి కోరడము లేదని అర్థం. "కితాబీ వాఙ్మయం", "జమీందారీ కవిత్వం", చెయ్యడంకోసమైనా వెనకటి భాష చాలదు. మనం ఈకాలం జగత్కుటుంబులని ఎంచుకుంటున్నాము. అనేక భావతరంగాలు వచ్చి తాకుతున్నాయి. మనప్రకృతి మునపటివలె లేదు. నవీన సన్నివేశాలకు, సంఘర్షణలకు, సమస్యలకు, ఉచితవ్యక్తీకరణానికి నూతనపద జాలమూ, అన్వయాలు కావాలి. దానికి లోకమే శరణం. శబ్దసిద్ధి లోకంవల్ల కలుగుతుం దని నన్నయభట్టారకుడు కూడా చెప్పాడు.

వైయాకరణి అయినా, కవి అయినా కొత్తమాట స్వయంగా సృష్టించలేడు. అది లోకం చెయ్యవలసినపని. అవసరం వచ్చినప్పుడు కొత్తశబ్దం బయలుదేరుతుంది. మొన్నటి ఐరోపాసంగ్రామంలో 'Camflouge' అనేమాట పుట్టింది. అంతా వాడుతున్నారు. సాహిత్యవృద్ధి చెయ్యాలంటే అర్థవంతమైన అనేకశబ్దాలు

వాడాలి. గ్రంథస్థం కాకుండా వ్యవహారంలో ఆంధ్రదేశం మొత్తంమీద లక్ష కొద్దీ శబ్దా లున్నవి. అవి గ్రహించవలసినబాధ్యత మనమీద వున్నది.

ఎటువంటిపదాలు ఉపాదేయములు ? ఇక్కడే మతభేదాలు ఏర్పడుతవి. కేవలము అనాగరకులు- అంటే పట్నాలకు బహుదూరంలో వుండేవారు, అడవుల్లో సంచరించేవారు, నత్తివల్లగాని, మరియేవాగ్నిరోధమువల్లగాని, ఉచ్చారణ చెడినవారు, అసభ్యవ్యవహారము చేస్తున్నవాళ్ళు- ఇటువంటివాళ్ళమాటలు అంగీకరించ నక్కరలేదు. స్వీకరించినశబ్దాలకు అన్వయం ఎలాగు ? భాషాతత్త్వం వాక్యరూపాన్ని నిర్ణయించే వున్నది. దాన్ని గమనిస్తే చాలు. కొండవీటి చేంతాళ్ళవలె దీర్ఘవాక్యాలుమట్టుకు పనికిరావు. కర్మణిప్రయోగాలు కూడవు.

మాండలీయకశబ్దాలు మనకు అర్థంకా వని విచారపడగూడదు. క్రమంగా అర్థం తెలుసుకుందాము. అనంతపురంలో నేను ఉపన్యసించినతరువాత సభలో ఒకవిద్వాంసుడు "మారాయలసీమభాష పుస్తకాలలో ఉపయోగించవచ్చునా అండి?" అని సవినయంగా అడిగాడు. నే నాశ్చర్యపడి "ఎందుకు వాడగూడదు ? తప్పకుండా వాడండి. మీరు అలా చేస్తే భాష వృద్ధి అవుతుంది" అన్నాను. "మామాటలు మీకు అనేకం అర్థంకావే" అన్నాడు ఆయన. "అర్థం కాకపోతే నేర్చుకుంటాము. వెనకటిపుస్తకాలలో భాష ఎంత కష్టపడి నేర్చుకున్నాము! ఇది నేర్చుకోవడం అట్టే కష్టంకాదు" అన్నాను. ఆయనద్వారా రాయలసీమ అంతా సంతోషించింది.

గ్రంథకర్తలకు సంశయం కలుగుతూ వుంటుంది- వాక్యాలు వ్రాయడం ఎలాగనీ, ప్రమాణము ఏది అనీ. ఆత్మప్రమాణమే ప్రమాణ మని నాఆశయం. లోకవృత్తం బాగా గ్రహించి జాతీయాలు, లోకోక్తులు సందర్భశుద్ధులు మొదలైనవన్నీ గ్రహించి తనకు నచ్చినట్టు వ్రాస్తే చాలును. పెద్దలతోగాని, గురువులతోగాని, సభారంగంమీదగాని, జాగరూకతతో ప్రసంగించే పద్ధతి అవలంబించతగ్గది. తనఇష్టానిష్టాలనుబట్టి గ్రంథకర్త కొన్నిరూపాలు స్వీకరిస్తాడు, కొన్ని విసర్జిస్తాడు. భాషలో అనేక రూపాంతరాలు వున్నవి. గమనంలో చాలా వైకల్పికా లున్నవి. ఇలా కొంతకాలం రచనలు సాగితే అప్పటికి **Standard** ఏర్పడవచ్చు.

నియమాలను వ్యతిక్రమించకుండా గ్రంథంచేసిన కవి లేడు. **Standard** అనేది ఊహామాత్రమే. కాని తెన్ను దాటి విచ్చలవిడిగా సంచరించవలసిన అవసరం వుండదు. ఉచితజ్ఞుడైనవాడు ఏవోనియమాలకు లోపడే వుంటాడు.

ఇటువంటిభావాలు కలిగి ఆరోజుల్లో నేను వచనరచనకు పూనుకొని చాలా మందిమిత్రులను ప్రోత్సహించాను. నవ్యసాహిత్యం ముందంజ వేసింది. పూజ్యులైన ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగారు 'మాలపల్లి' వ్రాసినతరువాత వాడుక భాషకు ఎక్కువగౌరవం వచ్చింది.

మొదట నేను వాడుక భాష సహజంగానే స్వీకరించి, తర్వాత కృతక భాష అవలంబించి, మళ్ళీ వ్యావహారిక భాషావాదిని కావడానికి నాలో జరిగినమార్పు వివరించాను. ఇది స్వీయచరిత్రగా కొంతమట్టుకు పరిణమించింది.

= సమాప్తం =

# నూత్న వసంతం

## శివరామం

తెనుగు పూలకు తావి తప్పినది నేడు,
తెనుగు పాటకు తీపి తగ్గినదికూడ;
కాని, తెనుగమ్మ కాళ్ల పారాణిలోన,
నుదుటిచుక్కలో, తళుకు కే కొదువ లేదు.

తెనుగు కత్తికి వాడి తప్పినది నేడు,
తెనుగు మాటకు వేడి తగ్గినది కూడ;
కాని, తెనుగయ్య నిడుపాటి కనుల కొనల
ఎరుపు దూకింపు చురు కింత తరుగ లేదు.

తెనుగు పొలములో పంట తప్పినది నేడు,
తెనుగు పొదుగులో పాడి తగ్గినది కూడ;
కాని, తెనుగు బిడ్డ యెడందలోన పొంగు
ఉడుకునెత్తు రెప్పుడు చల్లబడనె లేదు.

మూ[illegible]గిన చీకటిన్ నిదుర మున్గిన తెన్గు పడంతి కన్నులం
దూగదొ ఏదొ మంచికల ఒక్కటి ! కోయిల కన్న పాటలే
మ్రోగవొ ! లేగవో పడుచుపూవులతావులు ! ప్రాచియే వెలుం
గీగదొ ! మామొదల్ పులకరింపవొ నూత్న వసంత శోభలో !

# నేటి సాహిత్యము

రా. సా. గిడుగు వేంకట రామమూర్తిపంతులుగారు

ఈ నవ్యసాహిత్యపరిషత్తు వార్షికోత్సవము సందర్భములో నాచిత్రపటము బహిర్గతము చేసి నన్ను గౌరవించినందుకు మీకందరికీ నావందనములు. ఈ చిత్రపటము వ్రాసిన కవుతా రామమోహనశాస్త్రి గారిని నేను ప్రథమపర్యాయము చూచినది వారు ఈచిత్రపటము వ్రాయడానికి నన్ను చూడవచ్చినప్పుడే. ఈశిల్పికి నాపటము చిత్రించవలెనని ఎందుకు బుద్ధిపుట్టినదని నేను అడుగగా, అక్కడి మిత్రులవల్ల 'నేను వ్యావహారికభాషావాదములో చూపిన సత్యాగ్రహము తనకు నచ్చిన' దని శిల్పి చెప్పినట్లు తెలిసింది. ఈచిత్రపటము నాకు చిరమిత్రులైన ఉన్నవ లక్ష్మీనారాయణగారు తెరవడము నాకు సంతసము ద్విగుణము చేసినది.

నవ్యసాహిత్య పరిషత్తు అనగానే కొందరు రూరకే త్రాచుపాములవలె లేస్తారు. అసలు నవ్యసాహిత్యము అంటే అర్థ మేమిటి అనికూడా అంటున్నారు. ఆమాటకు సరైన అర్థము లేదని వారి ఊహ. 'నవ్యసాహిత్యము' అంటే నవ్య = ఇప్పటి సాహిత్యము అని నేను అంటాను. కొందరు 'నవ' లో నుంచి 'ను' (నూతన) వచ్చిం దంటారు. నేను 'ను'లో నుంచి 'నవ' 'నూతన' వచ్చినవి, అంటాను. ఇంగ్లీషులో నవ్ (Now) అంటే ఇప్పుడు. 'కు' అనేది కవ్ (Cow) ఐనట్లే 'ను' అల్లా ఇంగ్లీషులో నవ్ (Now) ఐనది. కాబట్టి 'నవ' లేక 'నూతన' అంటే ఇప్పటిది అని అర్థము. నవ్యసాహిత్యము అంటే నేటిసాహిత్యము అని అర్థము. ఇందులో తప్పు ఏమున్నది ?

నవ్యము, నూతనము, అంటే వీరికి ఇంతకష్ట మెందుకు? ఋగ్వేదము ప్రాచీనతమమైనదిగదా ! అందుకు మొదటి ఋక్కు 'అగ్నిమీళే' అని ప్రారంభిస్తుంది. దానివెంటనే 'అగ్నిః పూర్వేభిః ఋషిభిః ఈడ్యో నూతనైరుత' అని ఉన్నది. ఇక్కడ 'పూర్వేభిః' అని తృతీయాబహువచనములో పూర్వవైదికరూపమున్నూ 'నూతనైః' అని నూతన సాంస్కృతిక రూపమున్నూ ఉన్నవి. ఋషులు మంత్రద్రష్టలు. ఋగ్వేదకాలమునాడు కూడా పూర్వఋషులు చెప్పిన పాతఋక్కుల

---

నవ్యసాహిత్యపరిషత్తు పంచమవార్షికోత్సవములో రావుసాహెబు గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి అధ్యక్షోపన్యాస సారాంశము.

తోనూ నూతన ఋషులు చెప్పిన నవ్యఋక్కులతోనూ అగ్నిని పూజిస్తూ వచ్చినారు.

కొత్తలో నైరస్య మేమీ లేదు. గతమంతా గతము: అది తెలియదు. మనకు ఇప్పటిదే కావలె. నవ్యసాహిత్య పరిషత్తు కోరేది అదే. నేడు తెలిసే విషయాలు ఇప్పటి కవులు రచిస్తున్నారు. అందుకు తప్పేమీలేదు. మొదట మొదట చాలా మంది భావకవిత్వాన్ని తిట్టినారు. ఈనడుమ రాజమహేంద్రవరములో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్తు వార్షికోత్సవసందర్భంలో అప్పటి ఆహ్వాన సంఘాధ్యక్షులు తమ స్వాగతోపన్యాసములో భావకవులను అంగీకరిస్తే మంచి దన్నారు. దానినిబట్టి ఆంధ్రసాహిత్య పరిషత్తువారుకూడా ఇప్పుడు నవ్యసాహిత్యాన్ని ఆమోదించినట్లే కనబడుతుంది.

ఋగ్వేదకాలమునాడుగూడా నూతనఋషులు నవ్యఋక్కులు చెప్పినారు. అప్పటికి అవి నవ్యసాహిత్యము. తర్వాత బ్రాహ్మణాలు వచ్చినవి; ఆతర్వాత ఉపనిషత్తులు పుట్టినవి. అప్పటికి అవీ నవ్యసాహిత్యమే. పిమ్మట పురాణాలు పుట్టినవి. ఆపురాణాలే అప్పటికి నవ్యసాహిత్యము. కావ్యాలు పుట్టినరోజులలో అవే నవ్యసాహిత్యము.

కాని ఎప్పటి కప్పుడు నవ్యసాహిత్యానికి దెబ్బలు వస్తూనే వచ్చినవి; వాటిని పెద్దలు నివారించుకుంటూనే వచ్చారు. అన్నిటికంటే సాహిత్యానికి పెద్దదెబ్బ వేసినది 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనే నిషేధము పెట్టిన వైదికలోకము. వారిమతములో కావ్యము వేదమూలము కాదు కనుక వర్జ్యము. కాని అప్పటి కవులు ఆనిషేధానికి కట్టుబడక కావ్యాలు వ్రాసినారు. కావ్యాలలో శృంగారాది వర్ణనలు ఉంటవని వైదికులు ఆక్షేపిస్తే అప్పటివారు వేదములోనుంచి సంభోగ శృంగారం దగ్గరనుంచీ, కావ్యాలలో ఉండే అన్నివిషయాలూ, ఎత్తి చూపి వాళ్ళను నిరుత్తరులనుగా చేసినారు. కొందరు కావ్యము ఆనందము కలిగిస్తుంది కనుక కావ్యపఠనము వల్లకాదు అంటే కావ్యాలు కలిగించే ఆనందము బ్రహ్మానందసహోదరమని నిరూపించి కావ్యాలు కాంతాసమ్మితంగా ఉపదేశము చేస్తవని నిర్ధారణ చేసినారు. ఈవిధంగా అప్పటికవులు కావ్యప్రయోజనము సాధించినారు. లేకపోతే అప్పటినుంచీ ఇప్పటిదాకా ఒక్క స్వాధ్యాయప్రవచనమే ఉండి పోయేది.

ఆలాగే మొదట వచనకావ్యాలు వ్రాసేవారిని ఆక్షేపించినారు. తర్వాత 'వాసవదత్త' 'కాదంబరి' వంటి గొప్పవచనకావ్యాలు పుట్టినవి. అటుపిమ్మట

'కవీనా మగల ద్దర్పో నూనం వాసవదత్తయా' అనీ, 'బాణోచ్ఛిష్ట మిదంజగత్' అనీ వాక్యాలు పుట్టినవి.

ప్రాకృతంలో కావ్యాలు వ్రాయరాదన్నారు కొన్నాళ్ళు. ప్రాకృతము అపభ్రంశభాష అనీ అందులో కావ్యాలు వ్రాస్తే నరకంలో పడిపోతా రనీ భయపెట్టినారు. కాని తర్వాత 'సేతుబంధము' 'గాథాసప్తశతి' వంటి కావ్యాలు ఆ అపభ్రంశభాషలోనే పుట్టినవి. బౌద్ధుల మతగ్రంథమైన త్రిపిటిక మంతా జీవద్భాష ఐన పాలీభాషలోనే ఉన్నది. పాలీభాషలో ఎన్నో బౌద్ధమతగ్రంథాలు వ్రాశారు.

మనదేశంలోనే కాకుండా ఇతర దేశాల్లోకూడా కొత్త విషయాలకు మొదటలో కొంత బాధవస్తూనే వచ్చింది. క్రైస్తవుల మతగ్రంథమైన బైబిలు మొదట ఇంగ్లీషులో ఉండకూడ దన్నారు. విక్లిఫు (Wycliff) అది ఇంగ్లీషులో వ్రాస్తే తగలబెట్టించి ఆయననూ ఆయనను అనుసరించిన వారినీ ఎన్నో చిక్కులు పెట్టినారు. గెలీలియో (Galilio) ను అప్పటి మతాధిపతులు ఎన్నో చిక్కులు పెట్టినారు. ఇప్పటికి నూరేళ్ళ కిందటిదాకా ఆక్సుఫర్డు యూనివర్సిటీవంటి విద్యాలయాలలో ఇంగ్లీషు వాఙ్మయము ప్రత్యేకముగా చెప్పే ప్రొఫెసర్లు లేరు. ఇప్పుడు షెల్లీ, టెన్నిసను, షా – వీళ్ళ కావ్యాలు చదవనివాళ్ళను వ్యర్థు లంటారు.

'సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము' అనే మూడుమాటలను పర్యాయపదాలుగా వాడుతున్నాము. మూడుమాటలూ ఒకే అర్థంలో ఉపయోగించి వాటిని వృథాచేసే కంటే మూటినీ అర్థభేదముతో ప్రయోగిస్తే బాగుంటుంది. అందులో 'సాహిత్యం' అనే మాటను సామాన్యముగా ఇంగ్లీషులో 'కల్చరు' అన్నట్లు విశాలమైన అర్థంతో వాడితే మంచిది. ఈఅర్థములో సాహిత్యము లోకసంగ్రహార్థము ఎంతో ఉపయోగపడుతుంది. ఇప్పుడు శాస్త్రాలు అన్నీ కళలలోకి వస్తున్నవి. మనపూర్వులు యూరవు అంటేనే ఏమో ఎరగరు. ఇప్పటి శాస్త్రజ్ఞులు లోకమంతా తెలుసుకొని ఒకచోటినుంచి ఇంకొక చోటికి శీఘ్రంగా వెళ్ళుతున్నారు. అంతేకాకుండా జ్యోతిశ్శాస్త్రజ్ఞుల మనస్సులు ఇప్పుడు విశ్వవిహారం చేస్తున్నవి. ఈమధ్య ప్రతిభలో 'విశ్వపర్యటనము' అనే చక్కని వ్యాసము వ్రాసినారు. నేటి సాహిత్యం అనంతవిశ్వమంతా ఆక్రమిస్తున్నది.

నేటి లోకానికి ఉపకారము చేయవలె నంటే నవ్యసాహిత్యము కావలె. భారతాదులలోని నీతులు ఇప్పుడు పనికిరావు. నేడు లోకసంగ్రహము కోసము పుస్తకాలు వ్రాస్తే నేటి వ్యావహారిక భాషలోనే వ్రాయవలె. గ్రాంథిక భాష ఎవ్వ

రికీ రాదు. అది మన కిప్పుడు పనికిరాదు. ఇంగ్లండులో లోకసంగ్రహానికి ఈమధ్య ప్రధానంగా నాటకము, జర్నలిజము ఎక్కువగా ఉపకరిస్తున్నవి. అలాగే మన దేశంలో కూడా కావలె. కాబట్టి వాడుక భాష ఉపయోగించక తప్పదు.

ఈవాడుక భాష ఒకరూపంగా ఉండడం లేదని తెలియనివారు ఆక్షేపిస్తున్నారు. కాని వారికి జీవద్భాష స్వరూపమే తెలియదు. ఎక్కడైనా రెండు సూర్యోదయాలు ఒక్కేరూపంగా ఉంటవా? ఒకమనిషిని పోలిన మనిషి ఇంకొక డుంటాడా? ఒక్కమనిషివే రెండు చెవులూ ఒక్కవిధంగా ఉండవే. జీవద్భాషలో ఉన్న విశేషమే అది. అచ్చుదిమ్మెలో వేసి తయారుచేసేది కాదు. వ్యాకరణాలతో నిఘంటువులతో కట్టి వేస్తే పడివుండదు. అది జీవద్భాష. అది వాడకుండా ఉంటూ మనేవాళ్ళు నాలికలు కోసుకోవలసినదే.

ఈయుగములో స్పిరిట్ ఆఫ్ ఛాలెంజి **(Spirit of Challenge)** ప్రధానంగా ఉన్నది. 'ఛాలెంజి' అంటే తెలుగులో సరిఐనపదము లేదుకాని ధిక్కారము అనేమాట కొంత దగ్గరగా ఉంటుంది. కాబట్టి ఈయుగాన్ని 'ధిక్కారయుగము' అంటున్నాను. ప్రథమంలో కొందరు స్వతంత్రులూ కొందరు బానిసలూ ఉండేవారు. తర్వాత బానిసలు స్వతంత్రుల అధికారం ధిక్కరించి స్వతంత్రులైనారు. పూర్వం స్త్రీలు విద్య నేర్చుకోరాదు, ఉద్యోగాలు చేయరాదు. కాని వా రిప్పుడు మే మెందుకు పనికిరామూ అంటున్నారు. వాళ్ళు అన్ని ఉద్యోగాలూ చేస్తున్నారు. టర్కీలో ఇప్పుడు చివరకు ఆకాశవిమానాలు నడిపేందుకు ఆరువందల మంది స్త్రీలు సిద్ధమయినారు. సైనికదళాలలోకూడా స్త్రీలు చేరినారు. స్త్రీల రెజిమెంట్లే ప్రత్యేకంగా ఉన్నవి. ఈవిధంగా స్త్రీలు పురుషుల అధికారం ధిక్కరిస్తున్నారు. మొన్న మొన్నటివరకూ రాజ్యాలలో అధికారాలు ధనవంతులకే ఉంటున్నవి. కాని నేడు బీదవాళ్ళు ధనికుల అధికారం ధిక్కరిస్తున్నారు.

ఇటువంటి సమయంలో నేటి సాహిత్యాన్ని ఎవరైనా విమర్శిస్తే ఆవిమర్శకుల అవివేకమే వ్యక్తమవుతుంది. అట్టి విమర్శనలకు నిరుత్సాహపడనక్కరలేదు. కాళిదాసుకూ భవభూతికీకూడా ఆక్షేపణలు రాకపోలేదు. భాసుడూ మొదలైన వాళ్ళనాటకాలు ఉండగా ఈకొత్తనాటక మెందుకూ అని అప్పటి అజ్ఞానులు కొందరు ఆక్షేపిస్తే కాళిదాసు 'మాలవికాగ్నిమిత్రము'లో

" పురాణ మిత్యేవ న సాధు సర్వమ్
న చాపి కావ్యం నవ మి త్యవద్యమ్
సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః."

అని ప్రస్తావనలో చెప్పించి నవకవులను హేళనచేసే వారిని మూఢుల కింద కట్టి వేసినాడు. భవభూతికూడా అప్పటివాళ్ళు 'ఎందు కివి' అని ఆక్షేపిస్తే,

> 'యే నామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
> జానంతు తే కిమపి తాన్ప్రతి నైష యత్నః
> ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
> కాలోహ్యాయం నిరవధి ర్విపులాచ పృథ్వీ'

అని చెప్పుకోవలసి వచ్చినది. వర్డ్స్వర్తువంటి మహాకవి పుస్తకాలు మొదట పద కొండేళ్ళలో పదిప్రతులుమాత్రమే అమ్మకమయినవి. టెన్నిసనువంటివాడు తన పుస్తకాలు అమ్ముడుకాకపోవడము చూచి "This will never do" అన్నాడు. బెర్నార్డ్షా పుస్తకాలు అచ్చువేసేవాళ్ళే మొదట లేక పోయినారు. కాని ఇప్పుడు షా పుస్తకాలు విరివిగా అమ్మకమవుతున్నవి. 'షా'ను నీవు ఎందుకు పుస్తకాలు వ్రాస్తున్నావంటే "నేను నేటివాళ్ళకోసం వ్రాస్తున్నాను. నేటిలోకం కోసం వ్రాస్తున్నాను. శాశ్వతత్వంకోసం కాదు" అన్నాడు.

ప్రతి కొత్తఉద్యమానికీ మొదట చిక్కులు వస్తవి. నేను పాతికేళ్ళకిందట ఈ ఊరు వచ్చినప్పుడు వింజమూరి భావనాచార్యులుగారు 'మీవాదం అంగీకరిం చము' అన్నారు. వారి పుత్రులైన వింజమూరి రంగాచార్యులుగారు మద్రా సులో అదేవిధంగా గ్రాంథికభాషలోనే గ్రంథాలు వ్రాయాలె నన్నారు. కాని ఈపాతికేళ్ళలో ఎంతమార్పు జరిగిందో చూడండి! గురజాడ అప్పారావు చని పోయినప్పుడు వింజమూరి రంగాచార్యులుగారు సంవత్సరాదిసంచికలో విచార పడుతూ కావ్యము వ్రాసినారు. నావాద మంగీకరించని వింజమూరి భావనా చార్యులుగారి కుమారుడు పార్థసారథి వ్యావహారికభాషలో కథలు వ్రాస్తూ ఈ పరిషత్తులో సభ్యుడుగా ఉండడమే కాకుండా ఇంత వైభవంగా జరుగుతున్న ఈ సభవారి ఆహ్వానసంఘానికి కార్యదర్శులలో ఒకడుగాకూడా ఉన్నాడు.

నేటి సాహిత్యము సర్వతోముఖంగా వృద్ధి కావలెనంటే వ్యావహారికభాషలో యూనివర్సిటీలలో అన్నివిషయాలూ బోధించేందుకు పనికివచ్చే పుస్తకాలు వ్రాయవలె. షుమారు రెండుకోట్ల తెలుగువాళ్ళున్నారు. మనదేశంలో నూటికి పదిమందికంటె సంతకం చేయగలవాళ్లు లేరు. ఆపదిమందిలో చదివేవాళ్ళు బహు కొద్దిమంది. అందులో సాహిత్యగ్రంథాలు అర్థము చేసుకోగలవాళ్లు ఎంద రున్నారు? చదవలేనివాళ్ళ నందరినీ చదవగలిగేట్లు చేయడం మన పని. ఇంత మందికీ వ్యవహారానికి అవసరమైన చదువు చదివేట్లు చేయడానికి ఏభాషలో పుస్తకాలు వ్రాయవలె? కాశీ కృష్ణాచార్యులుగారు ఆంధ్రం సంస్కృతం కంటె

గొప్పది ; ఆంధ్రం బాగా రావలెనంటే సంస్కృతమూ, ఆంధ్రమూ పూర్తిగా వచ్చి ఉండవలె అన్నారు. నేనూ కొంత పూర్వాంధ్రభాష నేర్చుకోవాలని ప్రయత్నం చేశాను. కాని నాకు ఇప్పటికీ దాని స్వరూపం పూర్తిగా తెలిసింది కాదు. ఆ సందేహాలు తీర్చగలవారు ఎవరున్నారో నాఎదట నిల్చి చెప్పండి! అటువంటి పూర్వభాషలో కావ్యాలు వ్రాస్తే మనదేశంలో చదువురానివారందరికీ చదువు నేర్పగలమా? ఈ మూడుకోట్లమందీ నిఘంటువులూ, వ్యాకరణాలూ చెప్పకొని తర్వాత విద్య నేర్చుకొనవలెనా? గ్రాంధిక భాషలో కావ్యాలు వ్రాయలేరు. గ్రాంధిక భాష అనే పేరుతో అందరూ కృతక భాష వ్రాస్తున్నారు.

వ్యావహారిక భాష అంటే ఇప్పుడు శిష్టుల వ్యవహారంలో ఉన్న భాష. అది నేను ఉగ్గుబాలతో నేర్చుకొన్న భాష. అది దేశి, జానుతెనుగు! అది మనది, మనభాష. ఆ భాషలోనే కావ్యాలు వ్రాయవలె. కావ్యం నేర్పు దాని కూర్పులో ఉంటుంది. కర్పూరమంజరిలో సంస్కృతము మోటు భాష అనీ ప్రాకృతము సుకుమార మైందనీ అన్నాడు. అలాగే ప్రాకృతకావ్యము పసిపిల్లల వాక్కువలె అమృతమయమైన దన్నారు. కావ్యము అందము భాషలో లేదు. పూర్వపు వృత్తాలల్లో నేటి మాటలు పట్టవు. నేటి భాషకు తగిన వృత్తాలూ పాటలూ వాడుకలోకి తీసుకు రావలెను. గురజాడ అప్పారావు అన్నట్లు 'కొత్తపాతల మేలి కలయిక' ఉండవలె.

వ్యావహారిక భాష అపరిమితప్రయోజనము కలది. నవ్యసాహిత్యం లేకుంటే లోకసంగ్రహం జరగదు, లోకం వృద్ధి పొందదు! ఉత్సాహంతో పనిచేయండి! మీకు విజయం తప్పదు!

*

# నవ్యవసంతా!

పి. గణపతి శాస్త్రి

నవ్యవసంతా! దివ్యవసంతా!
వత్తువా! నా యౌవన వనికై!

దూర దూరమున నీరథ నినదము
తాళాంచలముల గలగల మ్రోగెనో!
ధూళీ జాలలై చల్లిరి నీకయి
గళితపర్ణనవ కాంచనాక్షతలు!

నవ్యవసంతా! దివ్యవసంతా!
వత్తువా! నా యౌవన వనికై!

ఇన్నాళ్ళకు నీ విటులు వత్తువన
భగ్గున మండిన బ్రదుకుటెడారిన
కాలినకాంక్షల ధూళు లెగయు నెవో!
రాలు నమృతవర్షాబిందువు లెవో!

నవ్యవసంతా! దివ్యవసంతా!
వత్తువా! నా యౌవన వనికై!

కోయిల 'కో' యను నిద్దుర వలలనె
వాయుకపోతిక లలనీ నిదుర గొను;
మ్రోగను వెట్టిన మర్రినీడలనె
ఉషుతల బుషుతల అడుగులు సడలెను;
నేనే మ్రోడయి నిలిచితి నీకయి!
నీరథనేమి రజోలవచుంబకయి!

నవ్యవసంతా! దివ్యవసంతా!
వత్తువా! నా యౌవన వనికై!

*

# గ్రంథ విమర్శనము

## విశ్వరూపం

గ్రంథకర్త : కాళీపట్నపు కొండయ్యగారు. ఎమ్. ఎస్. సి.

( నవ్యసాహిత్యపరిషత్సభ్యుడు )

పుటలు 20+278 చిత్రపటములు 50

వెల : రెండురూపాయలు.

ప్రకాశకులు – ఆంధ్రవిశ్వకళాపరిషత్తు. వాల్తేరు.

విశ్వరూపం చాలా ఉత్తమ గ్రంథం. ఇటువంటి శాస్త్రగ్రంథం మన భాషలో బయలుదేరినందుకు చాలా ఆనందం కలుగుతున్నది. ఇందులో పరమాణువు మొదలు బ్రహ్మాండం వరకు అన్ని విషయాలూ గ్రంథకర్త అతినిపుణతతో చర్చించారు.

ఈ గ్రంథం ఆంగ్లేయ జ్యోతిశ్శాస్త్రవేత్త అయిన సర్ జేమ్సు జీన్సుగారి The Universe Around Us అనే గ్రంథాన్ని అనుసరించి వ్రాసినప్పటికీ కొండయ్యగారు ఇంకా ఇతర శాస్త్రతత్వవేత్తల గ్రంథాలలోని విషయాలను కూడా సందర్భానుసారంగా ఇందులో సమకూర్చారు. ఎడింగ్టన్ అయిన్‌స్టన్, రాధాకృష్ణ మొదలైన వారి గ్రంథాలు ఈ రచనకు ఉపకరించినట్టు గ్రంథకర్త వ్రాశారు.

గ్రంథం అంతా ఏడుభాగాలుగా ఉన్నది. ఉపక్రమణం, గగనపథం, ద్రవ్యగర్భం, కాలవాహిని, విశ్వశిల్పం, నక్షత్రలోకం, ఉపసంహారం. ఉపక్రమణంలో భౌతికశాస్త్రముల పుట్టుక, వాటికినీ మతములకునూ కలిగిన సంఘర్షణవల్ల శాస్త్రములకు వచ్చిన చిక్కులు, మానసికదాస్యమునుండి ప్రజలను తప్పించుటకు బ్రూనో, గెలీలియో మున్నగువారు చేసినత్యాగములూ, వారికృషివల్ల శాస్త్రములు పొందిన అఖండాభివృద్ధి, ఆ అభివృద్ధివల్ల నేడు మనకందరకూ కలిగిన సౌకర్యములు మొదలైన విషయాలు గ్రంథకర్త చర్చించారు. విశ్వశిల్పం, నక్షత్రలోకం, గగనపథం, కాలవాహిని, ఈ నాలుగు భాగాలలోనూ చర్చింపబడిన విషయాలన్నీ అగాధములు. గగనపథం అన్నభాగంలో భూమ్యాది గ్రహముల యొక్క చరిత్ర, మనము నివసించే భూమిపరిమాణము, దానికీ సూర్యాది నక్షత్రాలకూ కలదూరాలు మొదలైనవన్నీ బాగుగా వర్ణించారు. విశ్వశిల్పంలో సృష్టి ఏవిధంగా జరిగి ఉంటుందో వివరించారు. నెబ్యూలలలో నుండి, నక్షత్రాలు, గ్రహాలు, సూర్యకుటుంబం ఏవిధంగా ఉత్పన్నమయి ఉంటాయో తెలుసుకోడానికి తగిన మార్గాలూ, వాటి వల్ల వచ్చిన ఫలితములూ వర్ణించబడ్డవి. నక్షత్రలోకంలో నక్షత్రములయొక్క వృద్ధిక్షయములు, నక్షత్రముల కాంతి వికీర్ణమునకు కారణములు చెప్పారు. కాలవాహినిలో భూమియొక్కవయస్సు, సూర్యాది గ్రహముల వయస్సు నిర్ణయించే మార్గములు, వాటి వల్ల ఏరీతిగా సూర్యుని వయస్సు సుమారు ఎనిమిదిలక్షలకోట్లు అని, భూమివయస్సు సుమారు 800 కోట్ల సంవత్సరములని నిర్ణయింపబడిందో వివరించారు. "ద్రవ్యగర్భంలో" ద్రవ్యమంటే ఏమిటో, ద్రవ్యానికీ శక్తికీ గల సంబంధం ఏమిటో అది తెలుసుకోడానికి ఏ ఆధారాలు ఉన్నవో వర్ణించారు. ఇంద్రియ గోచరమైన అసంఖ్యాక వస్తుసముదాయం నేడు

వేరుగా, రంగులరంగులగా కనిపించినా, వాటిని విభజించి చూస్తే అన్నిటిలోనూ ఉన్నవి 92 తత్త్వాలనీ, ఆ తత్త్వాలలో ఎలక్ట్రానులు, ప్రోటానులు న్యూట్రానులు తప్ప ఇంకేమీ లేదనీ, ప్రతి అణువులోనూ చాలవరకు ప్రదేశమే కాని ద్రవ్యమనబడేది అతిస్వల్పమనీ, అంతేకాక ఆ ఎలక్ట్రానులు, ప్రోటానులు కూడా సూక్ష్మపరీక్ష చేసి చూస్తే తరంగరూపంగా కనబడతాయనీ, ప్రపంచంలోని ద్రవ్యమంతాకూడా శూన్యప్రదేశంలో నుండే తరంగసంచయంగా ఊహించవలసి ఉంటుందనీ. శాస్త్రరీత్యా ఏయే విధాల శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారో, ఈ విషయాలన్నీ గ్రంథకర్త సులభంగా బోధపడేటట్లు పటములతో సహా వివరించారు.

గ్రంథంలో అక్కడక్కడ సందర్భానుసారంగా కొంత వేదాంత చర్చ ఉంది. ఉపసంహారంలో ఈ భాగం ఎక్కువ. విశ్వమును గురించి చర్చించేటప్పుడూ, సృష్టిస్థితిలయముల గురించి ఊహించేటప్పుడూ శాస్త్రమునకూ వేదాంతమునకూ సంబంధం ఏర్పడక తప్పదు. వేదకాలంలో మన పూర్వులు ఆధ్యాత్మికంగా తెలుసుకొన్న సత్యములను తెలిపే కొన్ని ఋక్కులూ, ఉపనిషత్తులలోని కొన్ని శ్లోకములూ కొండయ్యగారు గ్రంథస్థం చేశారు. సృష్టి ఏవిధంగా జరిగింది ? ప్రదేశం అంటే ఏమిటి, కాలం అంటే ఏమిటి ? ఈ రెండింటికీ అయిన్‌స్టయిన్ సాపేక్షసిద్ధాంతం ప్రకారం కలిగిన సంబంధం యొక్క అర్థం ఏమిటి ? ప్రదేశానికీ ద్రవ్యానికీ కల సంబంధం ఎట్టిది ? ద్రవ్యం ఎట్లు పుట్టింది, దానికి లయం ఎలాగు కలుగుతుంది, ఈ సృష్టికి లయం ఎప్పుడు ? ఈ ప్రపంచానికి పరిమాణం ఎంత, వయస్సు ఎంత ? అనే ఈ మాదిరి ప్రశ్నలకు వేదకాలంలో తెలుసుకొన్న సమాధానములూ నేడు శాస్త్రరీత్యా కనుక్కొన్న విషయములూ పోల్చి చూపడం వల్ల లాభమే కాని నష్టములేదు. హేతువాదం వల్లనూ, దార్శనిక ప్రయోగములవల్లనూ శాస్త్రరీత్యా తెలుసుకొన్న సిద్ధాంతములు, ఆధ్యాత్మికదృష్టికి సరిపోయినప్పుడు వాటికి బలంకలుగుతుంది. కాని శాస్త్రప్రకారం సరిపోనివి, వేదంలో కాక ఇంకే ఇతర మతగ్రంథములో ఉన్నా సరే సత్యమని నమ్మడానికి హేతువాదం ప్రకారం సరిపడదు. ఈ గ్రంథములో వ్రాసిన విషయాలకు వేదాలుగాని ఉపనిషత్తులుగాని ఆధారమని ఎంచకూడదు. భౌతిక శాస్త్రముల ప్రకారం తెలుసుకొన్న సత్యములు వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ చక్కని శ్లోకములలో చెప్పబడి ఉన్నాయని ఉదాహరించడానికి మాత్రమే గ్రంథకర్త వాటిని ఉల్లేఖించినట్లు గమనించవలసి ఉంటుంది.

ఈ గ్రంథంలోని భాష చాలా సరళంగా ఉంది. జనసామాన్యమున కందరకూ అర్థమయ్యే సులభమైన శైలిలో, వ్యావహారికభాషను ఉపయోగించి ఈ గ్రంథమును రచించినందుకు నవ్యసాహిత్య పరిషత్సభ్యులైన కొండయ్యగారికినీ, గ్రంథం ఈ ధోరణిలో వ్రాయమని ప్రోత్సహించిన శివశంకరశాస్త్రిగారికినీ ఆంధ్రులు కృతజ్ఞత చూపవలసి ఉంటుంది. ఉత్సాహమే ప్రధానంగా చేసుకొని గ్రంథరచనకు పూనుకున్నట్లు గ్రంథకర్త పీఠికలో వ్రాశారు. కాని ఉత్సాహమునకు సరిపోయిన సామర్థ్యము కూడా వారికి ఉన్నదని చెప్పక తప్పదు. పుస్తకమును చేతబట్టినది మొదలు పాఠకునకు అతికుతూహలము కలుగుతుంది. గ్రంథకర్తయొక్క ఉత్సాహము చదువరిని పుస్తకమును పూర్తిగా చదివే వరకు నిలవనీయదు. ఈ గ్రంథము భౌతిక శాస్త్రవిషయికమైన దైనప్పటికీ ఒక విచిత్రనవలవలె పాఠకుని భూమినుండి ఎక్కడికో లేవదీసి ఆవేశపూరితునిగా చేసి ప్రపంచపు విచిత్రములను చూపించి, విస్మయ చిత్తునిగా చేస్తుంది. కంటికి కనబడే ఈ ప్రకృతియొక్క నిజలక్షణములను చూపించి ఈ ప్రపంచములోని అద్భుత కల్పన తెలియ జేస్తుంది.

ఈ గ్రంథంలో ఉపయోగించిన పారిభాషిక పదములు చాలావరకు హిందూ విశ్వవిద్యాలయం వారు ఉపయోగించినవనీ, మరికొన్ని ఇతరగ్రంథములలోనుండి సేకరించినవనీ గ్రంథకర్త వ్రాశారు. భౌతికశాస్త్ర విషయములలోని "ఆధునిక వైజ్ఞానము దేశభాషలలో వ్రాయడానికి మొదటి అత్యం

తరం సరియైన వైజ్ఞానిక పదావళి లేకపోవడం " అని గ్రంథకర్త వ్రాసిన విషయం నిజమే, కాని ఈ గ్రంథంలో ఆ లోటు కనబడడం లేదు. సామాన్యంగా అన్నిపదాలూ సులభంగా అర్థం అవుతున్నాయి. గ్రంథాంతమందు పారిభాషిక పదావళి పట్టిక కూడా ఉన్నది. కాని సందర్భానుసారంగా పరిభాష అర్థమౌతూ ఉండడం వల్ల ఆపట్టికను చూడవలసిన అవసరం అంతగా కనపడడం లేదు.

ఈ గ్రంథమును చదివినతర్వాత ఇందులోని విషయాల గురించి ఇంకా విపులముగా తెలుసుకోవాలనీ, ఇందులో కట్టిన లెక్కలకు మూలాధారములను ఇంకా విశదంగా కనుక్కోవాలనీ తప్పకుండా అభిలాషకలుగుతుంది. ఆబాధ్యత గ్రంథకర్త సరిగానిర్వహించారు. ఈ ఉత్తమ గ్రంథమును చదివి గ్రంథకర్తయొక్క ఉద్దేశమును నెరవేర్చుటకు ఇంక పాఠకులు బాధ్యత వహించవలసి ఉంటుంది.

తెలికిచర్ల కృష్ణమూర్తి

## ప్రే మాం జ లి

కవి : వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య. 64 పుటలు. వెల లేదు.

ప్రకాశకులు: దేవభక్తుని వెంకటసుబ్బయ్య, పాటిబండ్ల కోదండరామయ్య. చేబ్రోలు

'ప్రేమాంజలి' ప్రేమగ్రంథమాలలో ప్రథమ కుసుమమై పూచింది. చెళ్ళపిళ్ళవారి దీవన లందుకొన్నది. కోమాండూరి కృష్ణమాచార్యులుగారి తొలిపలుకు గ్రంథకర్తకు ప్రోత్సాహజనకమై ఉన్నది. కృతికర్త విజ్ఞాపనలో చెప్పుకొన్నట్లు బాల్యదశలో భగవత్పరముగా విరచించిన పద్యాలన్నీ గుచ్చెత్తి గ్రంథరూపములోనికి తెచ్చారు.

కవిత్వం ధారాశుద్ధిలో ఉన్నదనడానికీ, అశుకవనపుపసలు ఉన్నవనడానికీ చెళ్ళపిళ్ళవారి మొహరున్న పద్యాలున్ను సాక్ష్యం. మొత్తముమీద అర్థగౌరవానికి అంతగా అవకాశం చూపక పోయినా కవిత్వధారమాత్రం అనర్గళంగా ఉన్నదని ఒప్పుకోక తప్పదు. ఈపద్యం చూడండి:

ఏలో జాలముసేసె దే మడిగినా నేమంతభారమ్ము గు
త్తాలంచుక్ నిను గోర, నేనుఁగుల గోరక్ మోటరుం గార్ల మా
టే లే దేమిటి కింక జంకెదవు తండ్రీ! నాపయిన్ నీ కృపా
లోలాలోకన మింత నిల్పు మది చాలున్ వేంకటాద్రీశ్వరా !

ఈపద్యంలోని విషయమువల్ల కవి ప్రకటించిన భక్తి ఎట్టిదో చక్కగా విశదమవుతూ ఉన్నది. వీరికి ఉపాసనావిశేషము ఉన్నదో లేదో కాని భక్త్యావేశపరవశులై- ప్రథమప్రయత్నము కాబట్టి సమాసాలజోలికి పోయి, నిరర్థకవాగాడంబరంలోనికి దిగక, చక్కగా సరళంగా 'పద్యాలు చెప్పుట తుష్యమించి' - సాఫీగా కవనమల్లినవీరికి సర్వవిధములా ప్రోత్సాహము కలిగించవలసినదే. మొదటిసర్గలో మొదటి పద్యం ఎంత సరళంగా ఉన్నదో చూడండి:

శ్రీయున్ వాణియుఁ జెల్మికత్తియలు మాశ్రీకంతుఁ డాత్మేశ్వరుం
డీ యారేడు జగాల యేలుబడి తల్లీ! నీయధీనంబు! స్వ

శ్రేయఃప్రాపణమాలికాంకురము నీచిత్తానురాగంబు: దీ
ర్ఘాయుర్దాయ మహామయత్వ మిడరాదా! రాజరాజేశ్వరీ!

రాజరాజేశ్వరీ, చంద్రశేఖరా, వేంకటాద్రీశ్వరా అనే మకుటాలతో ఉన్నవి ఈశతకములోని పద్యాలు.

ఈకవి అర్థగాంభీర్యం కోసమూ, అర్థపుష్టికోసమూ రచనాచమత్కృతి చూపాలి. కవిత్వం ప్రస్తుతం బాల్యదశలో ఉన్నప్పటికీ ఈ ప్రథమప్రయత్నములో గోచరమయిన పదలాలిత్యమూ, ధారాశుద్ధీ ముందుముందు దీతడు పరిణతమై, ఉన్నతమై, రసపుష్టితో కూడుకొన్న పద్యకావ్యాలు వ్రాయగలుగుతారనే నమ్మకము కలిగిస్తున్నవి. కేవలం ఆశువుచెప్పే (feats) గరిడీల ఫక్కీ మాని వేసి భావౌన్నత్యమూ, అర్థగాంభీర్యమూ ఉండేరీతిని సొగసుగా మెచ్చటగా కావ్యములు వ్రాయుదురుగాక అని కోరుతున్నాము. ఈపుస్తకాన్ని ఆంధ్రులంతా ఆదరించవలెననీ ఈగ్రంథమాల ఇంకా పూలుపూసి నందనవనము కావలెననీ మాకోరిక.

వాసు

## కు రం గీ కి రా త ము

కర్త : వేపకొమ్మ ఆదిశేషయ్య

ప్రకాశకులు: యం. యన్. నరసింహారావు, బి. ఏ., బి. యల్., ఆచారివీధి, నెల్లూరు

వెల : ఎనిమిది అణాలు.

ఇది ఒక ఖండకావ్యమని గ్రంథకర్త. ఖండకావ్యమే అనడమేమి? కావ్యమే అనవచ్చు. కథా పరిమితి లఘువుగా వున్నంతమాత్రాన దీన్ని ఖండకావ్యమని అనాలా? అంటే లఘుకావ్యం అందాము.

ఇందులోని కథ చాలా రసవంతమయినది. కవికి రసావిష్కరణములో మిక్కిలిగా తోడ్పడగల మంచి పదును ఈకథలోనే ఉన్నది. ఆ సౌకర్యాన్ని ఈగ్రంథకర్త చేజార్చుకోకుండా కథలో వున్న సహజమైన రసవత్తను చక్కగా వ్యక్తం చేశాడు.

ఆదిశేషయ్యగారు ఎక్కువ పేరుపొందిన కవి కాదు; ఎందుచేతనో? కవికి యోగ్యమయిన కోమలహృదయం కలవాడు ఆదిశేషయ్యగారు. పాండిత్యంలో కూడా ఏమిన్ని లోపం ఉన్నట్లు కనబడదు. ఈ రెండూ కలిసి ఈకృతిని మంచి పుస్తకాలలో జమకట్టుతున్నవి.

వీరి రచనాపద్ధతిలో నవ్యత చాలా తక్కువ. కవి అర్జించిన సంస్కారమంతా ప్రాచీనమార్గం లోనే ఉండియుండవచ్చు. పీఠికలో చెప్పుకోవడంకూడా ఈ కృతిని ధర్మోపదేశంకోసమే వ్రాసినట్లుగా ఉన్నది. శిల్పం కవి దృష్టిలో ప్రధానాంశం కాకపోయినా ఈకృతిలోమాత్రం కావ్యశిల్పానికి ఎక్కువ లోటు రాలేదు.

పద్యాలు చక్కని ధారాశుద్ధి కలిగి, కుటిలత్వం లేక, కటుత్వం లేక, ఋజు మృదుగమనంతో ఇంపుగా ఉన్నవి. గ్రంథాదిని ప్రాచీన కవుల మార్గంలో ఇష్టదేవతా నమస్కృతి, పూర్వకవిస్తుతి

గురుస్మరణ, కృతిసమర్పణ వగైరా అంశాలన్నీ ఉన్నవి. ఈ కవికి గురువు శ్రీయుత దుర్భ సుబ్రహ్మణ్యశర్మగారట. అయితే శయ్యా సౌభాగ్యంలోనూ, శైలీ సారళ్యంలోను వీరు గురువుకు కీర్తి తెచ్చినా రనవచ్చును. ప్రత్యక్షంగా వర్ణించి రూపాన్ని కళ్ళముందు నిలబెట్టగల నిర్దుష్ట వర్ణనమూ, స్పష్టచిత్రణమూ ఈ కవికి బాగా ఉన్నవి. వేటకుక్కల అలజడికి నిద్ర మేల్కొని పోరికి దుమికే పెద్దపులి వర్ణన చూడండి :

" నీలిగి యావులించి కను నిప్పులు రాలగ వాలమూర్చి యా
ఖీలరదాళి తెల్వరచి పెల్లగ గర్జిలి రోషపావక
జ్వాలలు గ్రక్కుచున్ నిశిత భల్లనఖాన్విత పూర్వపాదముల్
జాలగ విప్పి జాగిలపు జాలు నెదుర్కొనె వ్యాఘ్రి మత్తరిన్. "

" దుముకుచు, మ్రొగ్గుచున్, జలములోడ గిరుక్కున వామదక్షిణ
భ్రమణ మొనర్చుచున్, దొలగ బారుచు, శాతనఖోగ్ర దంష్ట్రికా
గ్రములను గ్రుచ్చుచున్, విజయకాంక్ష లెసంగగ శ్వానపుండరీ
కములు మహోగ్రభంగి బెనఁగన్ దొడగెన్ గడుసాహసంబునన్ "

ప్రసవ వేదన పొందుతున్న కురంగిని వర్ణించిన పద్యం చూడండి:

" ఉస్సురుస్సురటంచు నిట్టూర్పులెసర । దరచు మూల్గుచు, వదనంబు దెరచు, చకని
సొరుగుచును, లేచుచును, దిక్కులరయు చిట్టు । ప్రసవవేదన జెంగు సారంగి గాంచె."

కథలోని హృదయదారకమైన ఘట్టం ఎలాంటిదో చిత్తగించండి :

" పిరికిజాతి మొదలె ; పెంటి దానికితోడు ;
కాన్పువేళ ; త్రుంపగడగె వైరి ;
అగ్ని గ్రమ్ముచుండె ; నట్టి దుర్దశ ... ... "

ఇది కథ. ఈకథలోని ఈపరిపక్వఘట్టాన్ని ఈకవి ఎక్కువ సమర్థతతో నిర్వహించినాడని చెప్పవలసి ఉన్నది. వాచాలత లేదు; పేలవత్వం లేదు. పొందికగా, తగురీతిని ఈవిషమఘట్టాన్ని దాటగలిగేడు ఈకవి. నిజంగా ఈఘట్టంలో వున్న సారంగిస్థితి కంటే ఈఘట్టమును వర్ణించవలసిన కవిస్థితి మరీ కష్టమైనది.

కురంగి ఈవిధంగా కష్టపడుతుంటే కిరాతుడు బాణం వదలబోతాడు. అప్పుడు విల్లు విరిగి దానికొప్పు వాడి కంట్లో గ్రుచ్చుకుంటుంది. ఆదెబ్బకు వాడు స్మృతి తప్పి పడిపోతుంటే ఆచెట్టుయొక్క ఎండి విరిగినకొమ్మ వాడి డొక్కలో గ్రుచ్చుకుంటుంది. అబ్బ! వాడి వికృతరూపం వర్ణిస్తున్నాడు కవి:

" పీడిన జుంజురు వెండ్రుకల్ వ్రేలాడ గన్నుల నీరు రక్తంబుగార
చెదరిన మీసా లసృక్క్షతములుగాగ సెలవుల వెడలిన జిహ్వా దోప
వెడలని నిట్టూర్పు లడర దీర్ఘంబుగా సొంపరి నోటను చొంగగార
విరిగి వ్రేలాడెడు తరుశాఖలవిధాన వంగిజానులు కొమ్మ పాయవడగ
రక్తసంప్లుత దేహ మరణ్యమక్షికానికాయము గ్రమ్మంగ గడుపు సొచ్చి
శూలికి దోచెడు కొమ్మతో వికృతమయ్యె నపుడు తలక్రిందుగా వ్రేలు శబరిరూపు. "

ఇక చాలు. మంచి భావన, మంచి ధార ఉన్నవి. తగుమాత్రం భావావేశం ఉన్నది; దానికి తగిన సంయమనమూ ఉన్నది. ఈ కృతి మంచి కృతులలో ఒకటి అనవచ్చు. దీన్ని యూనివర్సిటీవారు విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా నియమించి తన్ను ప్రోత్సహించాలని ఈ కవి ఆశపడడంలో ఏమీ సాహసం లేదు. ఈ ఆశ సఫలమైతే సంతోషించ వలసినదే।

‘ శర్మ ’

## నౌకాభంగము

వజ్ఝల వేంకటేశ్వరకవి, బి. ఏ.
జయపురము, విశాఖపట్టణము జిల్లా.

వెల పండ్రెండణాలు.

వేంకట కాళిదాసకవులనే పేరుతో ప్రసిద్ధమైనజంట భిన్నమయి వజ్ఝల వేంకటేశ్వరకవి తన రచనము ఈవిధముగా వేరుగా ప్రచురించినందుకు వారికి అభినందనములు. అధునికులలో కవులు జంటల్లుగా చేరి ప్రచురించే దురభ్యాసము తిరుపతి వేంకటేశ్వరులు గడించిన కీర్తివల్ల ప్రారంభించినట్లు తోస్తుంది. ఈజంటతనము చెల్లితే వారికే చెల్లినదేమోగాని ఇతరులకు చెల్లదు. ఒక్క ఔరసపుత్రుడు ఇద్దరు పురుషులకు కలగడ మెంత అసంభవమో ఒక్కఉత్తమకావ్యము బహు కవులు నిర్మించడము అటువంటిదిగా కనిపిస్తున్నది.

ఈ నౌకాభంగమునకు మూలము టెన్నిసను ఇంగ్లీషులో రచించిన 'యీనకు ఆర్డను' అనే పద్యకావ్యము. ఇది భాషాంతరీకరణము కాదు. టెన్నిసను కావ్యములోని కథను తీసుకొని స్వతంత్రముగా వ్రాసిన పద్యకావ్యము. అందులో ఉన్నవిషయాలు కొన్ని ఇందులో లేవు. అందులో లేని వర్ణనలు ఇందులో ఎన్నో ఉన్నవి. టెన్నిసనుకావ్యము చదివితేకలిగే ఆనందముతో సదృశమైనభావము ఇంగ్లీషు రానివారికి కలిగించవలెననే ఉద్దేశముతో వ్రాసిన కావ్యం కాదిది. ఎన్నోచోట్ల ఇంగ్లీషుకావ్యములో వరుసప్రకారముగానే సంభాషణలుకూడా ఇందులో వ్రాసినారు. కాని దీనిని స్వతంత్రకావ్యముగానే పరిగణించవలెను.

ఇంగ్లీషులో కథ ఇది; ఈనకు, ఫిలిప్పు అనే ఇద్దరూ చిన్నప్పటినుంచీ 'అనీ' తో స్నేహముగా ఉంటారు. యౌవనము వచ్చిన తర్వాత అది దాంపత్యప్రేమగా మారుతుంది. అయితే ఎక్కువ ధైర్యశాలి ఐన ఈనకు తనను వివాహముచేసుకోమని అనీని ముందుగా కోరి వివాహమవుతాడు. సిగ్గుపడేస్వభావము కల ఫిలిప్పు బాధపడుతూ బ్రహ్మచారిగా జీవితమంతా గడపదలచుకుంటాడు. ఈనకువల్ల అనీకి ముగ్గురు పిల్లలు కలుగుతారు. పిల్లలకు డబ్బుబాధ లేకుండా చేయవలెననే పట్టుదలతో ఈనకు సాహసవృత్తితో నావికుడుగా జీవనము చేస్తూ ఉంటాడు. చివరకు అనీ వద్దంటున్నా వినక దూరయాత్రకు బయలుదేరుతాడు. ఎన్నాళ్ళకూ అతని జాడ తెలియదు. ఈనకు వెళ్ళిన పడవ మునిగిందని కబురుమాత్రము వచ్చింది.

ఇంతలో ఈనకు చిన్నపిల్లవాడు చనిపోయినాడు. అప్పుడు ధనవంతుడైన ఫిలిప్పు అనీని ఓదార్చి ఆమె పిల్లలకు తాను చదువు చెప్పించడానికి ఒప్పుకునేట్లు చేశాడు. చివరకు పది పదకొండేళ్ళు ఈనకుకోసము ఎదురుచూసి చూసి చనిపోయినాడని నిశ్చయించుకొని ఫిలిప్పును వివాహము చేసుకుంటుంది. వాళ్ళకు ఒకపిల్లవాడు పుట్టినాడు.

ఈనకు పడవ పగిలిపోగా మరిఇద్దరితోపాటు నిర్మానుష్యమైన ఒకదీవిని చేరుకున్నాడు. అక్కడ తోటివాళ్లుకూడా చనిపోగా ఒంటరిగా ఉండి ఉండి దారితప్పిన ఒకనౌకమీద ఇల్లు చేరుకుంటాడు, 'మిరియములేను' అనే పూటకూటింటి పెద్దమ్మవల్ల అనీవివాహముసంగతీ, సకుటుంబముగా సుఖంగా ఉన్నసంగతీ విని రహస్యముగా వాళ్లింటికి వెళ్లి చూచి ఇక తాను జీవించి ఉన్నది తెలిస్తే ఆకుటుంబానికి సౌఖ్యము పోతుందని స్థిరపరచుకుంటాడు; రహస్యముగానే ఉండ నిశ్చయించుకుంటాడు. తర్వాత కొద్దిరోజులకే చనిపోతూ తాను చనిపోయేదాకా రహస్యము బయలుపెట్టవద్దని ఒట్టు వేయించుకొని చెప్పి తనభార్యనూ పిల్లలనూ తలచుకుంటూ చనిపోతాడు.

వేంకటేశ్వరకవిగారి 'నౌకాభంగములో' అనీ శీల ఐనది, ఈనకు సుందరుడూ, ఫిలిప్పు కుమారుడుగా ఐనారు.

ఇది స్వతంత్రమైన కావ్యముగానే పరిగణించినా మూలము ఉన్నందున తప్పనిసరిగా పోలికలు చేయ బుద్ధి కలుగుతుంది. వెంకటేశ్వరకవిగారు సమర్థులే; ఐనా టెన్నిసనువంటి గొప్పకవితో పోల్చినప్పుడు సరితూగలేకపోతే వారి కది ఒకన్యూనత కాదు.

టెన్నిసను ఇంగ్లీషుకథలలో వాక్కులో మిక్కిలి మాధుర్యము కలవాడని ప్రతీతి కలవాడు. ఈ వెంకటేశ్వర కవిగారి వాక్కులోకూడా ప్రధానలక్షణము మాధుర్యమే. ప్రతిపద్యములోనూ ఈ గుణము ప్రధానంగా ఉంటుంది. రాయప్రోలు సుబ్బారావుగారి తృణకంకణము, కష్టకమల, స్వప్నకుమారము, స్నేహలతాదేవి కావ్యములను ఈకావ్యము జ్ఞప్తికి తెప్పిస్తుంది. పద్యాలనడకలోనే కాకుండా కథ చెప్పేవిధములో కూడా సుబ్బారావుగారి కావ్యాలు జ్ఞాపకము వస్తవి. ఐతే ఇందులో వాక్కులోనూ వర్ణనలలోనూ ఎక్కువ ప్రౌఢి కనపడుతుంది.

టెన్నిసను తన కావ్యములో కథకు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చి ప్రకృతివర్ణనలు క్లుప్తసరిగా చేసి దానివల్ల కథాసందర్భముకూడా సూచిస్తాడు. వెంకటేశ్వరకవిగారు కథ కంతసందర్భము లేకపోయినా అవకాశము చూచి ప్రకృతిని చక్కగా వర్ణిస్తారు. ఉదాహరణా లిస్తాను.

మొదట ఈనకూ అనీ కలిసి ఉండగా ఫిలిప్పు చూసి నిరాశచేసుకున్న ప్రదేశంలోనే తర్వాత ఫిలిప్పు ఆమెను తన్ను వివాహము చేసుకోమని కోరుతాడు. దీన్ని మొదట.

> "... but as he climbed the hill.
> Just where the prone edge of the wood began
> To feather toward the hollow, saw the pair etc"

అని, మళ్ళీ

> "But after scaling half the weary down,
> Just where the prone eldge of the wood began
> To feather toward the hollow all her force
> Foiled her; etc"

టూకీగా చెప్పి ఎంతో ధ్వనించేట్లు టెన్నిసను చేసినాడు.

వేంకటేశ్వరకవి మొదటి సందర్భములో ఎనిమిది పద్యాలలో చక్కగా వసంతసాయంకాలము వర్ణించినాడు. రెండవ సందర్భంలోకూడా వసంతసాయంసమయాన్ని మరి ఆరు పద్యాలలో వర్ణించినాడు.

అనీని ఓదార్చడానికి ఫిలిప్పు వచ్చినప్పుడు ఆమె ఒంటరితనాన్నే టెన్నిసను వర్ణించినాడు. వెంకటేశ్వరకవి ఆ అవకాశము చూచుకొని ఎనిమిది పద్యాలలో చక్కగా రాత్రిని వర్ణించినాడు.

ఈనకు ఒంటరిగా దీవిలో ఉన్న కథాభాగంలో అదీవిని ఎంతో చక్కగా వర్ణించి టెన్నిసను ఈనకు ఒంటరితనాన్నే బలపరిచినాడు. వెంకటేశ్వరకవి అఘట్టములో ప్రబంధకవుల శైలిని తన ప్రియురాలికి పిల్లతెమ్మెర, అళివరుడు, అబ్దము, పికము, కల్లోలము - వీటిచేత సందేశము పంపినట్లుగాకూడా వర్ణించినాడు. సందర్భ మెట్లా ఉన్నా పద్యాలన్నీ మనోహరమైనవి.

ఈనకు తనకథ మిరియములేనుకు చెప్పేముందు టెన్నిసను ఊరికే,

" he saw Death dawning on him, and the close of all' అని మాత్రము చెప్పి ఊరుకున్నాడు. ఆ కథాభాగములో ఈ కవి కోడికూసినవేళ దగ్గరనుంచీ సూర్యోదయందాకా ఉదయవర్ణనము ఏడు పద్యాలలో (అందులో రెండు సీసపద్యాలు) చేసి "అ యుదయసమయంబున నతడు తన్ను, నాదరించిన యావృద్ధురాలిఁ 'జేరఁ, బిలిచి యారీతి మెల్లనఁ బలికినాడు" అని కథ సాగించినాడు.

ఒకచోటమాత్రము వెంకటేశ్వరకవి నిస్సందేహముగా టెన్నిసను కావ్యములోకంటె తన ఔచిత్యబుద్ధి స్పష్టపరిచినాడు. టెన్నిసను కావ్యాంతములో ఈనకు మృత్యువును వర్ణిస్తూ.

"There came so loud a calling of the sea,
That all the houses in the haven rang.
He woke, he rose, he spread his arms abroad
Crying with a loud voice 'a sail ! a sail !
I am saved ; and so fell back & spoke no more.

అని అద్భుతముగా పూర్తిచేసి ఊరుకోక అనవసరముగా

" So past the Strong heroic soul away
And when they buried him the little port
Had seldom seen a costlier funeral "

చెప్పినాడు. ఈపంక్తులకున్నూ సార్థకత సమర్థించవచ్చునుగాని తృప్తి కలగదు. వెంకటేశ్వరకవి ఈ చివరి మూడుపంక్తులభాగమూ వదలివేసి

" ఆ యుఱపుతోనె మఱల శయ్యాతలమున
నతఁడు వెనుకకుఁ గూలినాఁడాక్షణంబ
నిలిచిపోయిన యా మూఁగ గళముతోనఁ
జలనమే లేదు మఱియొండు పలుకు లేదు.

అని పూర్తి చేసినాడు.

ఉత్తమశ్రేణికి చెందిన ఈ కావ్యమును అనేకభాషాకోవిదులూ స్వయముగా విద్వత్కవులూ జయపురసంస్థానాధీశ్వరులూ ఐన సాహిత్యసమ్రాట్ శ్రీవిక్రమదేవవర్మ మహారాజావారికి కృతి ఇయ్యడమూ ఎంతో సమంజసముగా ఉన్నది. కృతిపతికీ కృతికర్తకూ మా జయాశీస్సులు !

సో. స. శా.

## వీణ

సంపు. ౨ సంచికలు ౧-౨

సంపాదకుడు : పాటిబండ మాధవశర్మ, యం. ఏ.,

తేలప్రోలు (కృష్ణాజిల్లా)

ఏడాది చందా : రెండురూపాయలు.

ఆంధ్రులు గర్వించ దగిన 'వీణ' పత్రిక రెండవ యేడు ప్రాపించినందుకు పత్రికా సంపాదకు లను ముందుగా అభినందించ వలసియున్నది.

ఈ సంచికలో ముఖ్యము గమనించదగిన విషయము శ్రీగిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి 'సందేశము'. ఇందులో ఉదాత్తమై ముఖ్యముగా మనస్సును ఆకర్షించేది శ్రీ అమంచర్ల గోపాలరావు గారి 'మల్లమదేవి ఉసురు' అనే ఏకాంకనాటిక. 'సుభా' అనేది త్రివేణిలో ప్రచురించిన చక్కని కథకు మంచి అనువాదము. ఇందులోని పద్యాలలో 'పుట్టులేది' అనే తాత కృష్ణమూర్తిగారి కావ్యం మనోజ్ఞమైనది. నవ్యసాహిత్యపరిషత్తు ఐదవవార్షికోత్సవము సంగతి కొంత ప్రచురించినారు. విశ్వనాథ సత్యనారాయణగారి "శృంగారవీధి" ని తల్లావజ్ఝల కృత్తివాసతీర్థులుగారు విమర్శించినారు. ఇందులో 'చలం' గారి ప్రేమలేఖ — వారి రచనలన్నీ నచ్చేవారికి — నచ్చుతుంది. ఏది ఎట్లా ఉన్నా వారి Sincerity ని మెచ్చుకోక తప్పదు. కాని వారివ్రాతలలో దేవుడూ పూజా అంటే ఒక Obsession గా తయారవుతున్నదని వారు గమనించి నట్లు లేదు. ఇది ఎందువల్ల ? వారి అంతరంగ

చేస్తూ ఉన్నందుకు చేతనా! 'తెరచాటు కళ' లో మద్దాలి సూర్యప్రకాశరావుగారు ప్రసిద్ధ పాశ్చాత్య చిత్రకారుల అనుభవాలు వ్రాసినారు. ముందు చీనా చిత్రకారుల సంగతి వ్రాస్తారట. వావిలాల సోమయాజులుగారు 'ఆంధ్రభారత రచనోద్దేశము' ప్రధానముగా రాజరాజనరేంద్రుడు తన వంశచరిత్ర రచనగాని మతప్రచారమూ సారస్వతపోషణమూ కాదని సహేతుకముగా నిర్వచించినారు. 'సాహిత్యదీపంలో' ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు కాళిదాసుని ప్రాశస్త్యము ఉగ్గడించారు. ఇంకా దేవులపల్లి కృష్ణశాస్త్రి, పురిపండా అప్పలస్వామి, కనకదండి గోపాలకృష్ణశాస్త్రి, నోరి నరసింహశాస్త్రిగార్ల ఖండకావ్యా లున్నవి.

ఉత్తమశ్రేణిలో ఉన్న 'వీణ' ఆంధ్రలోకములో చిరస్థాయి ఐ ఇంకా విశేషజనాదరణ పొందవలెనని ఆసిస్తున్నాము.

## కథా వీధి

సంపాదకులు : శ్రీనివాసశిరోమణి : సి. నాగేశ్వరరావు.

62 వెంకటమేస్త్రీవీధి : జి. టి. మద్రాసు.

సంవత్సర చందా రు 3. లు : ఒడి ప్రతి 2 అణాలు.

ఇది నెలకు రెండుసార్లు వచ్చే క్రొత్తపత్రిక. ఆయినప్పటికీ మాసపత్రికలు ఉండవలసిన చక్కని రూపంతోనూ విషయములతోనూ వెలువడింది. ఈపత్రికను మేము స్వాగత మిస్తున్నాము. ఇందులోని ప్రకటనలో,

"ఈపత్రిక అంతా వ్యావహారికభాషలో వుండవలెనని మాసంకల్పము. వ్యావహారికభాషలో కాకుండా ఏదో అయోమయాంధ్రములో వ్రాసేవారు మాకు వ్యాసములు పంప నక్కరలేదు. అట్లా పంపినవారి వ్యాసాలు తిప్పి పంపనయినా పంపము," అని

"మాయీకథావీధిలో ప్రకటించే ప్రతి వ్యాసానికిన్నీ మాకు తోచినప్రతిఫలము ప్రతినెల 10 వ తేదీన 25 వ తేదీన వ్యాసకర్తలకు పంపుతాము" అని, స్వవిషయములో.

"మా రచయిత లందరికిన్నీ వారివారి రచనల తాహతునుబట్టి మేము ప్రతిఫల మీయలేక పోతే పోవచ్చును. కాని మా యీపత్రికలో ప్రచురించే ప్రతి అక్షరానికిన్నీ ఏదో మాశక్తికొద్దీ ప్రతిఫలము సకాలములో ఏవిధమయిన జాగున్నూ ఆలస్యమున్నూ లేకుండా యిస్తాము. ప్రస్తుతము కాక పోయినప్పటికిన్నీ అనతికాలములో ఒక్కొవ్యాసమువారికి కనీస మొక్కొమాసమ గ్రాసము అయినా యీయవలెననే మా ఆశయమూ సంకల్పమూను", అనిన్నీ, చేసిన ప్రతిజ్ఞలు ముఖ్యముగా గమనించ దగినవి. ప్రతిష్ఠాపకుల ఉత్తమాశయములకు వారిని అభినందిస్తున్నాము.

ఇట్టి పత్రికలు విశేష ప్రచారముమీద ఆధారపడక తప్పదు. అందుకుగాను సారస్వతశిల్పము మీదనే దృష్టి పెట్టుకుంటే వ్యవహారము నడవదు. మానవుని పశుప్రవృత్తికి ప్రాధాన్యమిచ్చి సామాన్యులవలె ఆకర్షిస్తూ వెంటనే అసహ్యము కలిగిస్తున్న రైల్వే వాఙ్మయము దారిపోకుండా, అల్పమానవులనుకూడా ఆకర్షించే ఉదాత్తవిషయములతో యీపత్రికను నింపి దేశములో అనన్యసామాన్యముగా ప్రచారముచేసి యీ పత్రికాధిపతులు ఇతరులకు మార్గదర్శకు లవుతారని మేము ఆశిస్తున్నాము. సుప్రసిద్ధకథకులైన శ్రీ శ్రీనివాస శిరోమణిగారు కూడా సంపాదకులలో ఒక్కరుగా ఉన్న యీపత్రిక తప్పక మాఆశలు నెరవేరుస్తుం దని నమ్ముతున్నాము. యీపత్రిక మొదటి సంచికనుబట్టి చూస్తే మావిశ్వాసము దృఢపడుతున్నది.

# సంపాదకీయము

## వార్షికోత్సవవృత్తాంతము

నవ్యసాహిత్యపరిషత్పంచమవార్షికోత్సవము గుంటూరుపురమందిరములో జనవరి 23, 24 తేదీలలో జరిగినది. పౌరులతోనూ, కళాశాలవిద్యార్థులతోనూ, శారదానికేతన విద్యార్థినులతోనూ, పొరుగూళ్ళనుండి వచ్చినపరిషత్సభ్యులతోనూ భాషాభిమానులతోనూ పురమందిరము సభలసమయములోనూ ప్రదర్శనముల వేళలోనూ క్రిక్కిరిసి మహావైభవోపేతముగా ఉన్నది.

ఈవార్షికోత్సవము జరపడానికి గుంటూరుపౌరులు ఆహ్వానసంఘము ఏర్పాటుచేసి దానికి కార్యనిర్వాహకవర్గముగా ఈదిగువ పేర్కొన్నవారిని ఎన్నుకొన్నారు. అధ్యక్షులు - ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు ; ఉపాధ్యక్షులు - రాయప్రోలు లింగనసోమయాజిగారు, పుప్పాటూరి పున్నారావుగారు ; కార్యదర్శులు - వింజమూరి పార్థసారధిగారు, మారేసుండ రామారావుగారు, తెలికిచర్ల వెంకటరత్నంగారున్ను. వార్షికోత్సవానికి కావలసినధనము సుమారు మూడు వందలరూపాయలు ఆహ్వానసంఘసభ్యులవల్ల చందారూపముగానూ ఉదారస్వభావు లయినపలువురు భాషాభిమానులవల్ల విరాళములుగానూ సేకరించి సభలు జరపడానికి పురమందిరమున్ను, బసలకూ భోజనాదిసౌకర్యాలకూ కాను హైస్కూలులో కొన్ని గదులున్ను పుచ్చుకొని కార్యనిర్వాహకవర్గమువారు ఉత్సవానికి ఏర్పాట్లన్నీ చేసినారు.

ఉత్సవము శనివారం (23వ తేదీ) ఉదయం 8 గంటలకు శారదానికేతన విద్యార్థినుల ప్రార్థనగీతములతో ఆరంభమయినది. తరువాత ఆహ్వానసంఘాధ్యక్షులు ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు ఉపన్యసించినారు. గుంటూరుజిల్లావారు పరిషత్తును ఈమండలానికి ఆహ్వానించడమూ, సమావేశము ఈవూళ్ళో జరపడమూ ఎంతో సమంజసముగా ఉన్నదనీ, తెలుగులో కవిత్వమూ గద్యరచనాకూడా శ్రీకారముచుట్టినది - ఇప్పటికి తెలిసినంతలో ఈజిల్లాలోని అద్దంకి శిలాశాసనములోనే అనీ, సుప్రసిద్ధకవు లనేకులు, తిక్కన, రామకృష్ణకవి మొదలయినవారీమండలానికి సారస్వతచరిత్రలో ఉన్నతస్థానము కల్పించినారనీ నవ్యసాహిత్యము విరివిగా సృష్టించినదీ ప్రచారములోనికి తెచ్చినదీ ఈమండలమే అనీ నిరూపించి, నవ్యసాహిత్యోద్యమముగురించీ వ్యావహారికభాషాప్రాశస్త్యముగురించీ ప్రజలలో ఉండే అపోహాలు క్రమక్రమముగా మాయమవుతున్న

వనీ, నవ్యసాహిత్యోద్యమవిషయములో ఆదినుంచీ కృషిచేస్తూవచ్చిన గురజాడ అప్పారావు గిడుగు రామమూర్తి పంతులుగార్లలో శ్రీరామమూర్తిపంతులుగారు ఈవార్షికోత్సవానికి అధ్యక్షులుగా ఉండడము అత్యంత సముచితముగా ఉన్నదనీ ఏఉద్యమముకోసము తమ అమూల్యమయినజీవితము ధారపోసినారో అది తమ జీవితకాలములోనే సఫలము కావడమునల్లనూ, అది ఈఉత్సవముద్వారా కళ్ళారా చూచేభాగ్యము కలగడమునల్లనూ వారు ధన్యజీవులయినారనీ, వారు చేయబోయేమహోపదేశము యువకవుల కందరికీ ఉత్సాహమూ, ఉత్తేజమూ కలిగిస్తవనీ చెప్పినారు. శ్రీపంతులుగారి జీవితములోని ముఖ్యవిషయాలను సభవారి కెరుకపరిచి, వారియెడల తమ కున్న భక్తిగౌరవములకు చిహ్నముగా వారి చిత్రపటము - శ్రీకొత్తా రామమోహనశాస్త్రిగారు చిత్రించినది - నవ్యసాహిత్యపరిషత్తువారు తమకార్యాలయములో నెలకొల్పదలచి నేడది బహిర్గతముచేయదలచుకొన్నారని చెప్పి ఆపటమును తెరతొలగించి సభవారికి ప్రదర్శించినారు. ఆతరువాత అధ్యక్షులు " నేటిసాహిత్యము " ను గురించి సుమారు రెండుగంటలసేపు ఉపన్యసించినారు. ఆ ఉపన్యాససారాంశము వేరొకతావున ముద్రించినాము. అధ్యక్షులప్రారంభోపన్యాసముతో ఉదయముసభ ముగిసినది.

సాయంత్రము 4 గంటలకు సభ తిరిగీ ప్రారంభమయినది. యక్షగానములనుగూర్చి ఎంతోకాలమునుంచి పరిశోధనచేసి తత్ఫలితముగా వ్రాసినచక్కని వ్యాసము శ్రీ చింతా దీక్షితులుగారు మొట్టమొదట చదివినారు. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారూ, కొండూరి వీరరాఘవాచారిగారు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారూ, విశ్వనాథ సత్యనారాయణగారూ తమకావ్యములలోని కొన్నిపద్యములు శ్రావ్యముగా చదివి వినిపించినారు. అడవి బాపిరాజుగారు రెండుమూడు పాతపాటలు- ప్రజాసారస్వతము ఎలాగుంటుందో రుచిచూపడానికి- ఎంతో రసోచితముగా అభినయముచేసి పాడి సభ్యులకు అమితమయిన ఆహ్లాదము కలిగించినారు. ఆరుగంటలకు సభ చాలించినారు.

నాటిరాత్రి 8½ గంటలకు 'పద్మావతీచరణచారణచక్రవర్తి' అనేపద్యనాటిక- శ్రీ శివశంకరశాస్త్రి ప్రణీతము- కాకినాడవారు ప్రదర్శించినారు. పద్మావతీపాత్ర ధరించిన బి. వి. నరసింహారావుగారికీ జయదేవపాత్ర ధరించిన గాడేపల్లి అనంతంగారికీ నవ్యసాహిత్యపరిషత్తువారు సువర్ణపతకములు బహుమతిగా ఇచ్చినారు. డాక్టరు చిలుకూరి నారాయణరావు రచించిన 'అశ్వత్థామ' అనే ఏకాంకరూపకము శ్రీ పెద్దిభొట్ల వెంకటచలపతిరావుగారూ శ్రీ వలివేటి శ్రీమన్నారాయణమూర్తిగారూ కళాశాలావిద్యార్థులు ముగ్గురున్నూ ప్రదర్శించినారు.

చలపతిరావుగారు అశ్వత్థామపాత్ర ధరించారు ; శ్రీమన్నారాయణమూర్తిగారు దుర్యోధనుడు. రాత్రి 12 గంటలలోపల ప్రదర్శనములు ముగిసినవి.

24 వ తేదీ (ఆదివారము) ఉదయము పరిషత్సభ్యులబసలో పరిషత్తుసాధారణసభ్యులసమావేశ మయినది. గడచినసంవత్సరముతాలూకు లెక్కలు కార్యనిర్వాహకవర్గమువారు ఆమోదించినతరువాత కార్యదర్శి ఆలెక్కలు సభవారి కెరుకపరిచి పత్రికాప్రకటనానికీ ఇతరపరిషత్కార్యాలకున్ను కావలసినధనము సభ్యుల చందాలవల్లమాత్రమే సర్దుబాటు కాదనీ, ఎవరికి తోచినరీతిగా వారు సామర్థ్యముకొద్దీ విరాళము లిచ్చీ, ఇతరులచేత ఇప్పించిన్నీ తోడ్పడవలెననీ కోరినారు. నూతనకార్యనిర్వాహకవర్గమునూ, ' ప్రతిభ ' సంపాదకవర్గమునూ గ్రంథనిర్ణాయకసంఘమునూ ఎన్నికొనడ మయినది. వచ్చేసంవత్సరము పరిషద్వార్షికోత్సవము బందరులో జరుపుతామని బందరుసభ్యులు పరిషత్తుని అక్కడికి ఆహ్వానించినారు. సభవారు వారి ఆహ్వానమును అంగీకరించినారు. 11 గంటలకు ఆహ్వానసంఘోపాధ్యక్షులూ, వైశ్యశిఖామణులూ, సాహిత్యప్రియులూ, అయిన శ్రీ వుప్పుటూరి వున్నారావుగారు పరిషత్సభ్యులకు విందు చేసినారు.

మధ్యాహ్నము 3 గంటలకు పురమందిరములో సభ ప్రారంభ మయినది. బి. ఏ. తరగతి విద్యార్థి రావులపర్తి సూర్యనారాయణమూర్తిగారు ' మాసుబ్బ సంగీతము ' అనే హాస్యరసప్రధానమయిన తమవ్యాసము చదివినారు. మునిమాణిక్యం నరసింహారావుగారు తమసహజధోరణిలో వ్రాసిన ఒకచిన్నస్కెచ్ చదివి వినిపించినారు. ' భావకవిత్వము – ప్రణయము ' అనేవిషయముగూర్చి వ్రాసినవ్యాసము గొడవర్తి సూర్యనారాయణరావుగారు చదివినారు. మాధవ రామశర్మగారు సాహిత్యతత్త్వముగూర్చిఉపన్యసించారు.పిమ్మటకొండాలిరాజారావు గారూ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారూ తమకావ్యములలో కొన్ని భాగములు చదివి వినిపించారు. వింజమూరి సోదరీమణులు – అనసూయా సీత– దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిపద్యాలూ గేయాలున్ను, నండూరి సుబ్బారావుగారి 'యెంకిపాటలు' కొన్నిన్ని, గురజాడ అప్పారావుగారి 'పుత్తడిబొమ్మ – పూర్ణమ్మ' అనే పద్యకావ్యమున్ను అద్భుతముగా పాడి సభ్యులను ఆనందపరవశులనుగా చేశారు. విశ్వనాధ సత్యనారాయణగారు తమ 'శృంగారవీధి' నుంచి కొన్నిఘట్టములువినిపించారు. తరువాత అధ్యక్షులు శ్రీరామమూర్తిపంతులుగారు పాతపలుకులకుకాక నోటిమాటకు ఎలాగ ప్రతిదేశములోనూ అమితమయినప్రభావమున్నదో అమెరికాసంయుక్తరాష్ట్రాధ్యక్షుడు చెప్పిన "The spoken word prevails" అనే వాక్యాన్ని ఆధారం చేసుకొని వివరిస్తూ, గంభీరోపన్యాసము చేసినారు.

సామాన్యగృహస్థుల సంసారాలు మొదలుకొని సామ్రాజ్యాలపార్లమెంటు సభలవరకూ ఉన్న సమస్తసంస్థలలోనూ చర్చలూ సంప్రతింపులూ— వీటివల్లనే కార్యకలాపమంతా సాగుతున్నది. లోకమంతా వోటు అనేమాటతో మారు మ్రోగుతున్నది. దేశపరిపాలకులుగా తగినవారిని ఎన్నుకొనేబాధ్యత గుర్తెరిగి ఈవోటు ఎంతమంది సార్థకముగా చేస్తున్నారో చూస్తే ఇది పసిపిల్లవాడిచేతికి కత్తి ఇవ్వడమువలె కనబడుతుంది. ఈవోటు అధికారము యుక్తముగా నిర్వహించలేనివారి కివ్వరాదని వెల్సు (Wells) అన్నాడు. మనదేశములో నూటికి తొంభైమంది నిరక్షరకుక్షులు. మిగతా పదిమందిలోనూ ఒక్కడైనా సరిఅయిన విద్య గడించినవాడున్నాడో లేదో! గవర్నమెంటువారి విద్యావిధానము వారి పాలనానికి అనుకూలపడేటట్టుగా గుమాస్తాచాకిరీకి తగినట్టుగా కొందరిని తయారు చేయడానికిమాత్రమే తోడ్పడుతున్నదిగాని వాస్తవమైనవిజ్ఞానము ప్రజలలో వ్యాపింపచేయడము లేదు. విద్యావిధానము మారవలెను. ప్రజలకు సులభముగా తెలిసేటట్టు మాతృభాషలో సమస్తశాస్త్రములూ బోధించవలెను. టర్కీలోవలె దేశచరిత్ర తిరిగీ వ్రాయించవలెను. నాజూకుగా, సరసంగా, సభ్యంగా, ఎదుటివారిమనస్సు ఆకర్షించేటట్టుగా మాటలాడడమూ ఉపన్యసించడమూ నేర్పవలెను. ప్రజాప్రభుత్వం బాగా ఉండవలెనంటే వక్తృత్వము (Oratory) బాగా వృద్ధి పొందవలెను. గ్రీసుదేశములో ప్రాచీనకాలములో 'వాగ్మి'గా ఉండడమే గొప్ప విద్యగా ఎంచుకొనేవారు. నోటిమాటకే జయము. నాటకరచనకూడా ఆదేశములో వృద్ధిపొంది ప్రజలను జ్ఞానవంతులనుగా చేయడానికి తోడ్పడ్డది. మనదేశములోకూడా వ్రాత (లిపి) లేనికాలములోనూ తరవాతఅచ్చుపుస్తకాలు రానికాలములోనూ నోటిమాటద్వారానూ ఉపాధ్యాయుల ఉపన్యాసాలవల్లనూ విజ్ఞానము విరివిగా వ్యాప్తమయేది. ఉపనిషత్తులు చూడండి. ఒకరు ప్రశ్నించడం - రెండోవారు సమాధానం చెప్పడం - ఈరీతి సంభాషణవలె ఉంటవి. వ్యవహారమంతా నోటిమాటలమీదనే సాగేది. భావము స్పష్టంగా తెలియవలెనంటే భాష సుపరిచితముగా, ఉగ్గుపాలతో అలవడ్డ మాతృభాష అయి ఉండాలి. ఒకరిమనస్సును ఇంకొకరిమనస్సుతో కలిపేసాధనము భాష. కళ్ళజోడు నేత్రాలనూ ఎదట ఉన్నవస్తువునూ ఎలాగ కలుపుతుందో అలాంటిది. ఈ ఉపకరణము ఉండికూడా అది అక్కడ ఉన్నట్టు ఉపయోగించేవాడు గుర్తించకుండా ఉండేటంత చక్కగా అమిరివుండవలెను. దృష్టిని నిరోధించేదిగా కాకుండా సులువుగా సాయము చేసేదిగా ఉండవలెను. అటువంటి చక్కనిభాష సర్వవ్యవహారాలకూ సారస్వతానికీ సాధనముగా ఉండవలెను. అదే మీకు జయము చేకూరుస్తుంది. దానితోనే అనేకవిధాలయినకావ్యజాలం సృష్టించండి. ఆగోధుమపిండితోనే పలు

విధములయిన రుచ్యపదార్థములు తయారుచేసేటట్లు ఆభాషతోనే నాటకాలూ, నవలలూ, కావ్యములూ, గీతములూ అన్నీ వ్రాయండి. నవ్యసాహిత్యపరిషత్తు వారు చేయబూనుకొన్నపని దొడ్డది. అందరూ సాయపడితేనేకాని ఆకార్యం సాగదు. మీ అందరి సాహాయ్యంతో వారి యత్నము జయము పొందవలెనని నా ఆశయము.

అధ్యక్షుల ఉపసంహారోపన్యాసముతో నాటిసభ 6½ గంటలకు అంతమయినది.

రాత్రి 8½ గంటలకు సంగీతవిశారద శ్రీపెనుమర్తి రామశర్మగారి మనోహర వీణావాద్యముతో ప్రదర్శనములు ప్రారంభమయినవి. వీణతరువాత ముద్దుకృష్ణ రచించిన "అనార్కలీ" ప్రదర్శనమూ, దానితరువాత విశ్వనాథకవిరాజుగారి "దొంగాటక" మనే ఏకాంకనాటక ప్రదర్శనమూ జరిగినవి. దొంగాటకము ప్రదర్శించినది ఆంధ్రక్రైస్తవకళాశాలావిద్యార్థులు. ప్రకాశరావు, రాజ్యలక్ష్మి- అనేపాత్రలు ధరించిన రావులపర్తి సూర్యనారాయణమూర్తి, శివరాజు వెంకట సుబ్బారావూ చక్కగా పాత్రాభినయము చేసినారు. అనార్కలీపాత్ర ధరించిన బి. వి. నరసింహారావుగారూ, అక్బరుపాత్రధారి పెద్దిభొట్ల చలపతిరావుగారున్ను సలీముపాత్ర ధరించిన శిష్లా ఉమామహేశ్ గారున్ను సభ్యులమెప్పు పొందినారు. అనార్కలీలో **Chorus songs** అనసూయాసీతలు భావము చక్కగా ఒప్పిస్తూ హాయిగా పాడినారు. విశ్వనాథ సత్యనారాయణగారి భరతవాక్యముతో పరిషద్వార్షికోత్సవము ముగిసినది.

చంద్రికా ముద్రాక్షరశాల గుంటూరు